"నేను ఇప్పుడు
టియారా వాడడం
మొదలు పెట్టాను"
అంటున్నారు బొంబాయి
అందాలరాణి
చిత్రా సుందరం

...టియారా టాల్క్
యొక్క ప్రత్యేక పూల
పరిమళం—నన్ను
మహామురిపిస్తుంది"







హెలెన్ కర్టిస్
వారి
టియారా
బ్యూటీ టాల్క్

HC-18-140-tl

మీ విచారణను ప్యారీ & కో లిమిటెడ్, మద్రాసు, కోయంబత్తూరు, మధురై, తిరుచ్చి, సికింద్రాబాద్,
బెంగుళూరు, మంగుళూరులకు పంపండి.

# ఉత్తరాలు

## సినిమా

16 4 76 నాటి పత్రికలో, శ్రీనివాస్‌గారు 'సినిమా విశేషాలు'లో రామారావుగారి చిత్రాలు కొన్ని తెలియచేయలేదు అవి, 'పంచవన్నెల చిలుక' పెరు, 'దాన వీర శూర కర్ణ' మొదలగునవి 'సామాన్యుని ఎలుగుడు' శీర్షికలో ఎరావేగారు సినిమా థియేటర్ల వారి ఇక్కట్ల గూర్చి చాలా బాగా తెలియచేశారు వారికి నా ధన్యవాదములు

ఎల్. పి. ఇంద్రా, (బొమ్మిరెడ్డిపల్లి)

## అభినందనలు

వెస్టిండీస్‌లో మన క్రికెట్ జట్టు గెల్చింది హోహో! ఎంతో ఆనందం గవాస్కర్ విశ్వనాథ్‌లు బాగా ఆడితే బిషన్‌సింగ్ బేడి ఏనాడో స్పష్టమైన నాయకత్వంమీద ఇంతవరకు ఎన్నిం 'రగడ' తగ్గిపోవచ్చును గ్రేట్ ప్లేయర్ అయినమానేజర్ పాలి ఉమ్రిగర్ అనుభవంతో మా జట్టు ఇంటికి ఘనంగా తిరిగిరాగల అవకాశం కలిగింది కానివెస్టిండీస్ టీము బలం అంతంత మాత్రమే సుమా అని ఇంగ్లాండ్ టూర్‌లో వారు ఆస్ట్రేలియా కథను పునరావృతం చేసుకుంటారని భయంగా ఉంది క్రికెట్ లవర్స్‌కి మీ వాళ్లకు మా జేజేలు

వి శైలేష్, వి శరత్‌బాలాజీ, లండ్ (ఫండ్)
(పొన్నూరు)



బిషన్ సింగ్ బేడీ

# ఆదా చేసుకోండి ఒక రూపాయి!

## సింథాల్ పౌడర్ పై- మీరు సింథాల్ సబ్బును కొన్నప్పుడు *




కూపన్ ప్రకటనతో కూడిన సింథాల్ సబ్బును కొనండి. ఆ సబ్బు యొక్క ప్రతి రేపర్ వెనుక ఒక కూపన్ ఉంటుంది. ఆ కూపన్ మీ డీలర్ కు అందించి సింథాల్ టాయిలెట్ పౌడర్ పై(ఏ సైజు దైనా సరే)ఒక రూపాయి తగ్గింపును అందుకోండి.







*స్టాకులు వున్నంతవరకే మరి ఈ సదుపాయం!

Interpub/GS/13/75 TL

## ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938–1972]

శుక్రవారం : 14–5–'76
నలనామ సం. వైశాఖ బ. పాడ్యమి
*సంపుటము : 69 సంచిక : 36*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

★

సంవత్సరచందా – రు. 33–80
ఆరుమాసాల చందా – రు. 16–90
విడి ప్రతి వెల 60 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ–520003.


## విషయానుక్రమణిక

అట్టమీద బొమ్మ :
నటి రమాప్రభ
(ఫోటో : పి. ఇలంగో)





సింహాద్రి చిన్న చిన్న అంగలని పెద్దని చేసినా, అయ్య ముందుకి వెళ్ళిపోతున్నాడు. "అర్రె ఈడేడీ?" అనుకుంటూ అయ్య (తండ్రి) ఆగగానే, పరుగులుతీసి వెళ్లి అతడి చేతి వ్రేళ్లు అందుకొని నడుస్తున్నాడు.

జారిపోతున్న లాగుని ఎగదీసుకున్నాడు. పెద్దపండుగకి అయ్య కొన్న జుబ్బాని అమ్మ ఊలికి తోడిగింది. బొత్తాము ఊడొస్తే జాకెట్టు పిన్ను తీసి పెట్టింది. నూనె రాసి జుత్తు నున్నగా దువ్వి, ఒక మల్లెమొగ్గ ముడిచింది. పరుగు తీసే సరికి పువ్వు పడిపోయింది. వెతికేడు. దొరకలేదు అయ్య ముందుకి వెళ్లిపోయేడు. మళ్ళా పరుగు.

కాళ్లకి జోళ్లు లేవు. పొలం గట్టుమీంచి నడుస్తూంటే సూదిరాళ్లు గుచ్చుకుంటున్నాయి. సూర్యుడు ఉదయించి ఒక గంట అయింది. రాత్రి బాగా వర్షం పడడంవల్ల పొలాలలోని నీరు, అద్దం ముఖంమీద కొట్టినట్టు, సూర్యకిరణాలని ప్రతిబింబిస్తోంది. ఒంటికాలుమీద కొంగలు చేపలకోసం ధ్యానం చేస్తున్నాయి. ఆకుపచ్చని తివాసీలా వరిచేలు భూమిని కప్పేయి. గాలికి అవి కదిలినపుడు, ఎండా నీడా కలయికవల్ల ఆకుపచ్చరంగు ఒకచోట దట్టంగానూ, ఒకచోట తేలికగానూ



ఉంది. సింహాద్రి కళ్ళు సూర్యకాంతిలో మెరిసేయి చల్లటిగాలి ముఖంమీదకి కొట్టగా హాయిగా ఉంది జుబ్బాజేబులో అమ్మనింపిన అటుకులు, బెల్లం తీసి నోట్లో వేసుకున్నాడు

"ఓరి సింహాదిరీ! కాళ్ళు నొప్పెడతే నా బుజం ఎక్కు!" రామన్న ఆగి, కొడుకుకేసి ప్రేమగా చూస్తూ అన్నాడు

"నేను నడుస్తాన్రా అయ్యా!", ఆకాశమంత ఎత్తున్న తండ్రి తలనీ, దానిమీది పాగానీ గర్వంగా చూస్తూ అన్నాడు. "ఇవాళ పాగా సుట్టి అయ్య యెంత పొడుగెదిగి పోనాడు!" అనుకున్నాడు. లంచేతుల జుబ్బా, ముతకపంచ, తలపాగా లో, రామన్న హుందాగా ఉన్నాడు

"దొరకాడ కెళ్తున్నప్పుడు ఉతికిన బట్ట తేసుకోవాల" అని అమ్మ అంటే, అయ్య పదిపైసలిచ్చి లాడి అప్పన్నకొట్టుకి వెళ్ళి సబ్బుముక్క తెమ్మన్నాడు

లాడప్పన్న బుర్రమీద ఇప్పుడు రెండే వెంట్రుకలున్నాయి ఆ పల్లెలో కిరాణీ మకాణం ఇరవైఏళ్ళ క్రితం తెరిచినప్పుడు జుత్తు ఒత్తుగా ఉండేది. కాని ఒక్కొక్క రూకా నిలవ వెయ్యడంతో వెంట్రుకలు రాలపోగేయి ఈ రెండు వెంట్రుకలూ రాలిపోయే సరికి లక్షా పూర్తవుద్ది అనుకుంటాడు అప్పన్న టవునికి వెళ్ళి, టోకున, అతి చవకమార్కు వస్తువులని తెచ్చి, అతి ఖరీదైన ధరకి చిల్లరగా అమ్ముతాడు బార్ సబ్బుని పది ముక్కలకి బదులు ఇరవై ముక్కలు చేసి ముక్క పదిపైసలకీ అమ్ముతాడు ఆ సబ్బు టవున్లో రయిసారయ్యే బ్రాండు

"ఒక్క సబ్బుముక్కియ్యవా దొరా!" అని అడగ్గానే సింహాద్రికేసి చూసి కస్సుమన్నాడు "యెదవా! దూరంగా నిల్చో!" అని రిస్తేడు, బెల్లం, పప్పు, ఉప్పు కొనుక్కుంటున్న అలగాజనం ఒక కుష్ఠురోగపు మనిషి వచ్చినట్టు దూరంగాజరిగేరు తన తప్పేమిటో సింహాద్రికి అర్థం కాలేదు అయ్యని ఒకనాడు అడుగుతే "ఈ జలమ కింతేరా!" అన్నాడు.

రామన్నని మరోసారి చూసేడు సింహాద్రి వాడి దృష్టిలో ప్రపంచంలో అందరికన్నా అయ్యే గొప్పవాడు పొడుగైనవాడు. బలమైనవాడు! కాని అయ్యకి ఎవరూ మొక్కరు



అయ్యే అందరికీ దండాలు పెడతాడు అయ్య ఎవరికీ దొరకాడు. అయ్యకి అందరూ దొర! అమ్మోరి సంబరానికి అయ్య బాణాకర్రతిప్పి కండలు జిగజిగా మెరిసినాయి! అయ్య పులివేసమేసి, 'జజ్జనా పుల్సులా.! జజ్జన పుల్సులా!' అని గెంతుతుంటే యెంత బాగుంటాడయ్య!

పొలాలదాటి చిన్నమెట్లుంగి రోడ్డు ఎక్కేరిద్దరూ "ఇంకా యెంత దూరముందో." రోడ్డు పక్కని చిన్న పల్లెటూరుంది పక పులిశాలలా వున్న పాకలో ఒక బడి నడుస్తోంది పంతులు కుర్చీలో కునుకుపాట్లు పడుతున్నాడు. సింహాద్రి బడిముందు ఆగి తనంత వయసులోనేవున్న పిల్లల్ని చూసేడు సింహాద్రిని చేతులూపి పిలిచేరు కొందరందులో కొంతమందికి ఒంటిమీద జుబ్బాలు లేవు కొందరు చింపిరి జుత్తులలోనూ, ఈనపుల్లలలాంటి కాళ్ళూ చేతులలోనూ కూర్చొని కునికిపాట్లు పడుతున్నారు, కొందరు హాయిగా ఆడుకుంటున్నారు ఆవరణలో.

రామన్న ఆగి, సింహాద్రిని రేపేసి పిలిచేడు సింహాద్రి తండ్రి దగ్గరకి పరుగులెడుతూ వెళ్ళి అన్నాడు... "అయ్యా! నాను కూడా సదువుకుంటాన్రా?" "అలాగేరా!" రామన్న అన్నాడు.

సింహాద్రి చదువు గురించి ఇదివరకు చర్చ జరిగింది సింహాద్రి విన్నాడు "సింహాద్రిని ఇసుకూల్లో వెయ్యవా?" అమ్మ అంది. "ఆడికి సదువెందుకె?" అన్నాడయ్య "సదవకపోతే యేటి చేస్తాడు? కసింత రాయడమూ, సదవడమూ వస్తే కచేర్లో దొరుకుద్ది నౌకరీ! నీలాగే ఆడూ బుగత భూమి దున్నతూ ఉండిపోతాడా?" "పంతులు మనోడ్ని యిసుకూల్లో సేరుత్తాడా?" "పంతులు ఇస్కూలు కాపోత్తే బ్రాకోళ్ల ఇస్కూలుంది" అమ్మకి అన్ని సంగతులూ ఎరిక. "సరే సూద్దాం" ఆ సంగతే మరచి పోనాడయ్య

పల్లెటూరు దాటేరు, పైన గూడులు ఉన్నవీ, గూడులు లేనివీ ఎడ్లబళ్ళు వెళ్తున్నాయి పట్నంవేపు ఒత్తుగా పరచిన ఎండు గడ్డిమీద వెదురు బాళ్ళు పరిచి కూర్చున్నారు పల్లెటూరి స్త్రీలు. కట్టుకున్న చీరలు ఎన్నో రంగులవి. జుత్తు నున్నగా దువ్వుకొని మల్లెపూలు ముడుచుకున్నారు. వర్షాలు ఆరంభమయినా మల్లెపువ్వులు ఇంకా

వస్తూనే వున్నాయి. ముక్కుకి బంగారు నత్తులు చెవులకి దుద్దులు చేతులకి ఎర్రటి గాజులు, వాటిమధ్య వెండి కడియాలు

ఒక బండిలోని ముసలావిడ రామన్నను అడిగింది... "నీ కొడుకా?" రామయ్య గర్వంగా కొడుకుని చూసి... "ఔనమ్మా!" అన్నాడు

ముసలావిడ పక్కన కూర్చున్న వయసు లోని పిల్ల రామన్నయొక్క విశాలమైన ఛాతీని చూస్తోంది "బొట్టెడు అలసి పోతున్నాడు! ఏవూరెల్తారు?" సోగగాకళ్లెత్తి అడిగింది.

"సీపురుపలి!" ఆమె కళ్లలోకి సూటిగా చూడలేక ఏటో చూస్తూ అన్నాడు రామన్న

"సుట్టపు స్థాపుకా?" అడిగింది యువతి.

"కాదమ్మా తాసిల్దారు దొర ఆజరు అగమన్నాడు."

"ఆపీచుపనా?" ముసల్ది అడిగింది అర్థమయినట్టు.

"యినమ్మా! నా అయ్య, తాత కాలం నించి బుగతల భూమి దున్నుకుంటున్నాం పెద్ద బుగత సచ్చిపోనాడు సిన్న బుగత భూమి ఒదిలి పొమ్మంటున్నాడు ఏడికిపోతాం దొరా .. మీ పాదాలకాడే బతుకుతున్నాము తాతలకాడ్నుంచి... యిది నాయమా? అంటే తాసిల్దారు దొరకి రిపోర్టిచ్చిండు. ఈ ఏడు భూమిని దున్ననివ్వనేదు! ఏటవుద్దో ఏటో?" తన సంగతి చెప్పుకొన్నాడు రామన్న

"యియాలా రేపు న్యాయంయెదయ్యా..." అంది ముసలావిడ.

# కొలువు

"మీ బొట్టేనా?" మర్యాదకి అడిగేడు రామన్న. ఇప్పటివరకూ కత్తి చూపులు చూసి ఇప్పుడు పువ్వంత నాజూకుగా సిగ్గు పడింది పడుచు

ముసల్ది కళ్లు ఒత్తుకుంది. "ఏటి సెప్పమంటావ్ బాబూ! దీనలొత్తర్ది సీపురు పల్లి. ఏ ముూర్తాన్న పెళ్లిజేసేమోకాని, దీని కాపురమిలాగయినాది!"

"ఏటయింది?" ఆత్రంగా అడిగేడు రామన్న.

"ఆడిబుద్ది మంచిదికాదని తెలిసింది కాదుబాబు! లాగుడలవాటు. ముండలు న్నారు. తాగొచ్చి దీన్ని సితకతన్నేవోడు ఒంటిమీది బంగారమల్లా అమ్మేసి పుట్టిం టికి తోలినాడు. యిప్పుడు మారుమనువు సేసుకుంటాట్ట. దీన్నాట్టికెళ్లి, యిది నీ బారియ .. యేలుకుంటావో... సంపుకుం టావో నీ యిష్టం! అని సెప్పి ఒదిలి పెడతాను .."

పడుచుపిల్ల కన్నీరు తెచ్చుకోలేదు సింహాద్రిని చూస్తూ అంది "బొట్టెడ్ని బండిల కూకుండబెట్టు. అల్సిపోనాడు!"

తన కులం అడుగుతారని భయంవేసి "ఎందుకమ్మా. అల్లదేకదా ఊరు ఒస్తా మమ్మా! నా పేరు రావన్న. బొట్టెడు పేరు సింహాద్రి..." అని సింహాద్రిని భుజం మ్మీద కూర్చోపెట్టికొని ముందుకు సాగేడు రామన్న.

ఆయ్యని ఆడోళ్ళందరూ మంచిగే చూస్తా రనుకున్నాడు సింహాద్రి అమ్మా అయ్యనెలా చూస్తదో, ఈ యమ్మా (యువతి) కూడా అయ్యని అట్టానే జూసింది చిన్న రోడ్డు వదిలి తారురోడ్డు ఎక్కేరు... లారీలు .. కారులు, బస్సులూ వస్తూపోతున్నాయి. కావిళ్లతో మనుష్యులు చీపురుపల్లి మార్కెట్టున దినుసులు పల్లెలనించి తీసుకవెళ్తున్నారు పాలూ, పెరుగును, కూరగాయలూ, గంపలలో, స్త్రీజనం నెత్తిన పెట్టుక నడుస్తున్నారు

"అద్గదే సీపురుపలి!" దూరంగా తెల్లటి వెల్లతో అగపడిన ఇళ్లని చూస్తూ కేకేసేడు సింహాద్రి. ఉయ్య భుజం ఎక్కితే వాడికి తాటిచెట్టెక్కినట్టుంది వాడి మనసులో ఒకసారి అమ్మా అయ్యలతో పట్నం వెళ్లి బయస్కోపు, చూడడం గుర్తుకొచ్చింది ... ఎంతో బాగుంది బయస్కోపు రావుడూ .. రావనాసురుడూ పట్నంలో అన్నీవుంటాయి.

ఇవాళ అయ్య, సింహాద్రికి చీపురుపల్లిలో అయిసిప్పిస్తానన్నాడు, తను చెప్పినట్టు తాసి ల్దారు కాళ్లమీద పడితే ఎవరి కాళ్లమీదన్నా పడడం చిన్నతనంగా తోచింది సింహాద్రికి. అయ్య అందరికీ భయపడి తిరుగుతాడు. కాని అయ్యకీ కోపం ఒస్తూ ఉంటాది అను కున్నాడు సింహాద్రి పుల్లిగాడు అమ్మ సెయ్యి పట్టుక లాగినపుడు ఆడి మక్కెలిరగదన్నే డయ్య.

చీపురుపల్లి ఊరులోని కొచ్చేరు సింహాద్రీ, రామన్నా, సింహాద్రి భుజంమీంచి దిగి నడవ సాగేడు ఇళ్లనీ, మనుష్యులనీ చోద్యంగా చూస్తున్న వాడికి ప్రపంచం అందంగా కని పించిందాక్షణం కాఫీ హోటల్లోంచి సినిమా పాటలు విన్పిస్తున్నాయి. బస్స్టాండులో రంగు రంగుల బస్సులున్నాయి ఎక్కమంటూ. "యీ బస్సెక్కడమే యెప్పుడూ అయింది కాదు. జాం .మనెళ్ళిపోతది ... ఈ పట్నంలో ఉండిపోతే యెంత బాగుంటది!" శోభన్ బాబు, వాణిశ్రీల, రంగు రంగుల పోస్టర్ చూసి వాళ్లిద్దరూ అయ్యా, అమ్మలంత బాగున్నారనుకున్నాడు.

కనబడిన వాళ్లని "బాబూ. తాసిల్దారు దొర దిగే బంగలా యేడుంది?" అని అడుగుతూ, కొందరిచేత తెలీదనిపించుకొని, కొందరినించి అందిన తప్పు సమాచారంతో

(42వ పేజీ చూడండి)



**అద్దం ముందు నిలబడి: తుది మెరుగులు దిద్దు కుంటున్న భారతి ఫోను రింగు కాగానే ఆత్రుతగా రిసీవరు ఎత్తింది ఆవతల కంఠం, విన్న భారతి ముఖంలో ఎన్నో కాంతులు విరజిమ్మాయి.**

''నేనే భారతి నండీ''

''నీవు వేరే చెప్పక్కరలేదు, వీణ మీటినట్లు, కోయిల కూసినట్లు హలో అనగానే దేవిగారే అనుకున్నాను'' అన్నాడు శరత్ అవతల నుంచి.

''మీ మాటలకేమొచ్చిందిలే కాని మీరు షాపింగుకు వస్తున్నారా లేదా?''

''అర్జంటు కేసు వచ్చింది కండిషన్ సీరియస్‌గా వుంది నేను రావటానికి వీలులేదు కారు పంపిస్తాను నీవు వెళ్ళకూడదూ'' శరత్ అన్నాడు

''ఎప్పుడు మీరు ఇంతే ఒకప్పుడు అనుకున్నట్లు వచ్చారు కనుకనా ఈ రోజు రాలేదని దిగులు పడటానికి'' టక్కుమని రిసీవర్ పెట్టేసింది భారతి సోఫాలో కూర్చున్న భారతికి గతంలోకి ఆలోచనలు పోయినాయి

''నేను శరత్ బావను చేసుకోను''




అని ఖచ్చితంగా చెప్పింది భారతి నాన్నతో దానిభవిష్యత్తు దానికితెలియదేమిటి అని వూరుకుంది తల్లి శరత్ తల్లి రామయ్యగారికి ఒక్కతే చెల్లెలు శరత్‌ని, అతని చెల్లెలు అనితని, రామయ్యగారి చేతుల్లో పెట్టి, శరత్‌ని నీ అల్లుడుగా చేసుకో అన్నయ్యా అని ప్రాణాలు వదిలింది శరత్ తల్లి

శరత్ తండ్రి మరొక వివాహం చేసుకున్నాడు, ముసలి భర్త, పడుచు భార్య మొదటి భార్య పిల్లలపై సవతి తల్లికి వుండే మమకారం, అంతంత మాత్రం అందుకే సవతి తల్లి ప్రేమ అంటారు దాన్ని, పిల్లల భవిష్యత్తు మాట మర్చిపోయారు యిద్దరు శరత్ గవర్నమెంట్ స్కాలర్ షిప్‌తో యం బి, బి. యస్. చదివాడు అనితకు ఇష్టంలేని సంబంధం కుదిర్చారని వూరు వదలిపోయింది, ఎవ్వరికీ చెప్పకుండానే, అనిత అంటే శరత్‌కి అమితమైన ప్రేమ మనిషికి వున్మాదం వచ్చిందంటే, ఎంత ప్రేమించేవారినైనాసరే ఒదిలి వెళ్లిపోతారు, తన, మన అనే భావాలు వారిని బంధించలేవు, చూసేవారికి విడ్డూరంగా కనిపించినా చెప్పేవారికి అది సహజమేననిపిస్తుంది

తల్లిదండ్రులు ఎన్నో విధాల ఒప్పించిన మీదట భారతి శరత్‌ను వివాహం చేసుకుంది

డాక్టర్లది అదొక జీవితం వారు ఎంత మంది స్త్రీలనో చూస్తారు చేతులు పట్టుకుంటారు, వారిలో స్పర్శజ్ఞానం వుండదేమోననిపిస్తుంది, చూసేవారికి. లేడీ డాక్టరైతే, పురుషునిసాంగత్యంలో పెద్ద భావపూరితమైన ఆనందానికి అంతగా తావుండదని మామూలు మనిషి అనుకునే మాట, డాక్టరు భార్యకు యాక్టర్ భార్యకు, ఎంతో ఓర్పువుంటే తప్ప సంసారాలు సుఖమయం కావు అందుకనే భారతి డాక్టరు భార్యకావటానికి అంగీకరించలేదు

ఎంత డబ్బు హోదావున్నా డాక్టరుల జీవితాలకు శాంతి, విశ్రాంతి, వుండవని భారతి నమ్మకం, అయినా వివాహాలు స్వర్గంలోనే చేయబడతాయంటారు అలాగేనేమోనని సరిపెట్టుకుంది భారతి.

కారు హారన్‌విన్న భారతి ఆలోచనలకు అంతరాయం కలిగి యీ లోకంలోకి వచ్చింది మరల. భారతి నైర్మల్యం, నిరాడంబరత్వం, అన్నింటినీ మించిన అపురూపమైన సౌందర్యంతో చక్కని అజంతా చిత్ర

# ఈ వేసవిలో మీ పిల్లలకు ఎక్కడ చెమట పేలుడు సంభవిస్తుంది?

మెడ

నుదురు

రొమ్ము

వీపు

చేతులు

కాళ్లు

ఎక్కడ పేలినప్పటికీ, జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరుతో అరికట్టండి. ఒక్క జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరు మాత్రమే 3 రకాలుగా పనిచేయు ఔషధీయుక్త ఫార్ములా కలిగియున్నది

- చెమటను పీల్చుకొని, చర్మముల రంధ్రములను మూసివేయుటను అరికడుతుంది
- క్రిములు పెరుగుదలను నిరోధిస్తుంది,
- చల్లదనం, హాయిని చేకూర్చి తక్షణం ఉపశమనము చేకూరుస్తుంది.




స్నానము తదుపరి మరియు నిద్రపోవుటకు ముందు జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరు విరళంగా చల్లండి. అది ఒక్కటే తల్లులు విశ్వసించే ఔషధీయుక్త పౌడరు; చెమట పేలుడు నుంచి ఉపశమనమును కల్గించేది— తక్షణమే.

చందనపు సువాసనలో గూడా దొరుకుతుంది.

## ఒక్క జాన్సన్స్* ప్రిక్లీహీట్ పౌడరు మాత్రమే మంటను ఆపుతుంది, దురదనుంచి ఉపశమనం ఇస్తుంది. తక్షణమే.

Johnson & Johnson*

# వారఫలం

మహేష్

**14-5-1976 శుక్రవారం మొదలు**
**20-5-1976 గురువారం వరకు**

**మేషం :—** ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు వారంమధ్యలో ప్రయాణాలు ఫలిస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి. స్త్రీలకు- ఆరోగ్యం బాగుండదు. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధిస్తారు.

**వృషభం :—** రావలసిన డబ్బు అందుతుంది. నూతన వ్యవహారాలు లభిస్తాయి. వారం మధ్యలో సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. చిరాకులకు గురికాగలరు. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు లాభించగలవు స్త్రీలకు కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అనవసరమైన వ్యయం జరుగుతుంది.

**మిధునం :—** వృత్తిలో పోటీవారిపోటీ పెరుగుతుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి. నూతన వ్యవహారాలు బాగుంటాయి. మీ ఆలోచనలు ఫలిస్తాయి. వారం ఆఖరులో మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. స్త్రీలకు ఆరోగ్యం బాగుంటుంది. ఎవరితోను మాట పట్టింపులు తగవు.

**కర్కాటకం :—** వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. మీ ఆలోచనలు ఫలిస్తాయి. ప్రయాణాలు బాగుంటాయి. రావలసిన డబ్బు అందుతుంది. స్త్రీలకు- కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**సింహం :—** మీ మంచితనమే మీకు ఇబ్బంది కలిగిస్తుంది. పోటీవారిలో గౌరవం బాగుంటుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. ఇతరుల నిమిత్తం శ్రమకు గురికావలసివస్తుంది. స్త్రీలకు- ఆరోగ్యం బాగుంటుంది. బంధువుల వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి.

**కన్య :—** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. ఆర్థిక

---

సుందరిలా కూర్చున్న భారతిని, చూసి శరత్ మురిసిపోయాడు.

"ఏమిటి దేవీ కోపమా," సోఫాలో కూర్చున్న భారతి ఒడిలో తలపెట్టి పడుకున్నాడు శరత్. "ఏమిటి మవునవ్రతం పట్టావా."

చెక్కిలిపై చిన్న చిటికవేశాడు మరల, అతనికి ఎప్పుడు భారతి ముగ్ధ సుకుమార మూర్తిగా కనిపిస్తుంది. ఆమె చెక్కిళ్ళపైన తేలికగా చిన్న ముద్దు పెట్టుకున్నాడు.

"తొందరగా వచ్చారే ముఖం తుడుచుకుంటూ" అంది భారతి చిరుకోపం చిందిస్తూ.

ఓరచూపు, కోరచూపు ఒకటి కాదని శరత్ కి తెలుసు. "డ్యూటికి వెళ్లిన దగ్గర నుంచి ఒక్క నిమిషం కూడా కూర్చోలేదు. చాలా నీరసంగా వుంది భారతీ కాఫీ కాని టీ గాని వుందా."

"బత్తాయి రసం తీసి ఫ్లాస్కులో పోసాను. లేచి బట్టలు మార్చుకోండి" యింక బాధ పెట్టాలనిపించలేదు భారతికి ఆ స్థితిలో శరత్ ని.

అబ్బ నీ వడిలో పడుకుంటే ఎంత హాయిగా, వుందో తెలుసా, ఆమె పెదవులను చూపుడు వ్రేలులో వ్రాశాడు శరత్.

రాత్రి పదకొండు గంటలవరకు ఏహో మెడికల్ జర్నల్స్ పుస్తకాలు చదువుకుంటున్న శరత్ ని "ఇంక నిద్రపోండి మళ్లి ప్రొద్దుటే డ్యూటీకి వెళ్ళాలిగా ఏ సేవ తప్పినా ఆ సేవ తప్పదుగా" చిరునవ్వుతో అంది భారతి.

## మల్లెమాల

పుస్తకం మూసివేసి భారతి ప్రక్క మంచం మీద పడుకున్నాడు శరత్.

"అంటే నీ సేవ చేయటంలేదనా నీ బాధ."

"అదేంలేదులెండి నన్ను నిద్రపోనీయండి" ప్రక్కకు తిరిగింది భారతి

"అది ఎలా, దేవిగారి సేవ మర్చిపోతానా" బలవంతంగా ఆమెను తన కౌగిలిలోకి తీసుకున్నాడు. "అబ్బ వదలండీ ప్రొద్దుపోయింది పడుకుందాం" "నేననేది అదే" కొంటెగా ఆమె కళ్లలోకి చూస్తూ అన్నాడు శరత్.

భారతి తల దించుకుంది సిగ్గుతో. "నీలాంటి నిష్కల్మషమైన ప్రేమ స్వరూపిణి ఎన్ని జన్మలెత్తినా దొరకదేమో." అంటూ ఆమెని తన కౌగిలిలోకి తీసుకున్నాడు. భర్త చెక్కిళ్లకు తన చెక్కిళ్లను ఆనించి, ఆనందంలో మునిగిపోయింది. అణు అణువునా అనురాగం తొణికిసలాడింది ఆమె హృదయంలో.

కొత్త దంపతులకి కాలం గడవదేమోననే బెంగే వుండదు. ఆ రోజులే, ఎవరి జీవితాలలోనైనా మరపురానివి ఆ తరువాత ఎడ మొఖం పెడ మొఖం తప్పదు కొందరి జీవితాలలో.

"భోజనంవడ్డిస్తానులేవండి" భారతిఅంది.

"నేను తినేవచ్చా, బయట. నీవు తిను" అన్నాడు శరత్.

"ఎక్కడ తిన్నారు ?" భారతి ప్రశ్నించింది.

"ఒక ఫ్రెండ్ ఇంట్లో," ముక్తసరిగా సమాధానం. "ఆడామగా" భారతి ఒక పట్టాన వదలలేదు

"ఏమిటి భారతి నీపిచ్చి ప్రశ్నలు," విసుగ్గా అన్నాడు శరత్.

"మీకోసం భోజనం చేయకుండా ఎదురు చూస్తూ కూర్చునే వ్యక్తి వుందని తెలిసికూడా మీరు భోజనం చేసి వచ్చారంటే నా మనస్సు ఎంత బాధపడుతుందో తెలుసా" బాధగా అంది భారతి.

"సారీ భారతి, ఎప్పుడూ అలా చేయను" సంజాయిషీ చెప్పుకున్నాడు శరత్.

ఇంకొక రోజు, మధ్యాహ్నం టిఫిన్ పంపింది హాస్పిటల్ కి భారతి. పనికుర్రవాడు తిరిగి తెచ్చిన టిఫిన్ బాక్సులో ఎంతో కష్టపడి చేసిన బీట్ రూట్ హల్వా, బోరన్ విటా చూడగానే ఆమె చిన్న మనసు నొచ్చుకుంది. ఎవరో అమ్మాయి అయ్యగారు బట్టల కొట్లోకి వెళుతున్నారమ్మా అంటు పని కుర్రవాడు వాడి ధోరణిలో వాడు చెప్పుకుపోయాడు. ఒకనాడు. ఆరోజు రాత్రి పొద్దుపోయింతరువాత వచ్చాడు శరత్.

"భోజనానికి వస్తారా."

"నాకు ఆకలి లేదు."

"షికార్లు చేయడంతో ఆకలి పోయిందా లేక ఆమెగారి సాన్నిధ్యంలో సర్వ సుఖాలు అనుభవించి వచ్చారా" వెటకారంగా అంది భారతి, బాధను వెళ్ళగక్కుతూ.

"ఎందుకు అలా తొందరపడి నోరు పారేసుకుంటావు భారతీ" శరత్ నెమ్మదిగా అన్నాడు, "ఎవరో అమ్మాయితో వీధులన్నీ

# జయచిత్రకు మహదానందాన్నిచ్చినవి!



అభిమాన చిత్రం : సోగ్గాడు
స్కూల్లో చదువుకునే రోజుల్లో: సినిమా చూసేందుకు
స్కూలు ఎగవేసిన క్షణాలు.
మరుపురాని రోజు : మొదటి చిత్రం యొక్క
అగ్రిమెంట్‌పై సంతకంపెట్టిన రోజు
ఆమెకు అందాన్నిచ్చే సబ్బు : ఆమెకు ప్రియమైన లక్స్




"లక్స్ అంటే నాకెంతో ఇష్టం. శుద్ధమైన,
సౌమ్యమైన లక్స్-నా రూప లావణ్యాన్ని మృదువుగా,
అందంగా రూపొందిస్తుంది." అంటారు జయచిత్ర.

## శుద్ధమైన, సౌమ్యమైన లక్స్-సినిమా తారలకు అందాన్నిచ్చే సబ్బు

HLL.9632 A)

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి విశిష్ట ఉత్పాదన

వ్యవహారాల్లో సొంగనమాటాలు తగవు. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. స్త్రీలకు- పుణ్యకార్యాలు చేస్తారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**తుల :—** ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి వృత్తిలో పోటీవారి పోటీ తగ్గుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. స్త్రీలకు- ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**వృశ్చికం :—** వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. రావలసిన డబ్బు అందుతుంది. మీ ఆలోచనలు ఫలిస్తాయి. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. స్త్రీలకు- కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**ధనుస్సు :—** మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. వ్యాపారంలో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. ప్రయోజనంగల సంభావనలను జరుపగలరు. స్త్రీలకు- ఆరోగ్యం బాగుండదు. సాహిత్య కళా రంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

**మకరం :—** ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం మధ్యలో మీ తాలూకు వస్తువులు పోవచ్చును వ్యతిరేకమైన వార్తలను వింటారు. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి. స్త్రీలకు- కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కుంభం :—** అన్ని వ్యవహారాల్లోను గౌరవం లభిస్తుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. నూతన వ్యవహారాలు బాగుంటాయి. రావలసిన డబ్బు అందుతుంది. వారం ఆఖరులో చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. స్త్రీలకు- ఆరోగ్యం బాగుంటుంది. అధిక వ్యయం జరుగుతుంది.

**మీనం :—** సంతోషకరమైన వార్తలను వింటారు. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. మిత్రుల సహాయం లభించగలదు స్త్రీలకు- దైవకార్యాలు నెరవేరతాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

---

## మల్లెమాల

విహారం చేస్తున్నారటగా, కనీసం ఆ అదృష్టదేవత ఎవరో తెలుసుకోవచ్చా" హేళనగా అంది భారతి" "అది నీకు తొందరలోనే చెబుతాను కొంచెం ఓపికపట్టు భారతి" అన్నాడు శరత్.

"మిమ్మల్ని పెండ్లి చేసుకుంటానని ఏడ్వలేదు—అన్ని దాపరికాలు వున్న పెద్దమనిషి నన్నెందుకు పెండ్లి చేసుకున్నారు" నిలదీసి అడిగినట్లు స్థాయి పెంచింది. "భారతి నేను చేయరాని పని చేయటంలేదు కొంచెం మనస్సు చిరాకుగా వుంది కొద్ది వ్యవధి యివ్వు నాకు" అన్నాడు శరత్.

"అయ్యో నలుగురు పిల్లలు పుట్టిన తరువాత ఆ మహాతల్లిని తీసుకువచ్చి నా నెత్తిన కూర్చోపెడుతారు. ఆ శుభసమయం కోసం నేను ఎదురుచూడాలి. ఛీ ఛీ మీ మగవాళ్ళు చాలా స్వార్థపరులు. భార్యను ఆటబొమ్మగా చేసి ఆడిస్తారు. మీ ఇష్టంవచ్చినట్లు తిరిగి ఇంటికి వచ్చేసరికి సకల సౌకర్యాలు భార్య ఏర్పాటు చేయాలి. భార్య మీ వుద్దేశ్యంలో దాసిదానికన్నా హీనం. దాసీదాన్ని ఏదైనా ఒక మాట అంటే ఆమె పడదు. నీ పని ఎంత నీవెంత అని వెళ్ళిపోతుంది. కాని భార్య భర్త ఎన్నిమాటలన్నా ఎన్ని తప్పుడు పనులుచేసినా, చచ్చినట్లు పడివుండాలి" వెక్కిరింపుగా అంది భారతి "ఇంక ఆపు నీ పిచ్చి ధోరణి" శరత్ కసిరాడు 'నా నోరు మూయించవచ్చు కాని నాకు వ్యక్తిత్వం వుందని మీరు గ్రహించండి, అది చాలు' అంది. 'నన్ను అపార్థం చేసుకోకు, నీవు చదువుకున్న దానివి నేను ఎటువంటి వాడినో గ్రహించలేని అజ్ఞానివి కావు. కొంచెం ఓర్పు చూపితే అంతా అర్థమౌతుంది నీకు. లేచి భోజనం చెయ్యి భారతీ" తల నిమిరాడు శరత్.

"ఇంక ఎప్పుడు ఆమెతో స్నేహం చేయనని వాళ్ల యింటికి వెళ్లనని నా చేతిలో చెయ్యి వెయ్యండి" భారతి చిన్నగా ఏడ్వసాగింది." అలా ఒట్టు వేయలేను భారతీ ఆమెవల్ల నీకు ఎటువంటి హాని కలగదని ఒట్టువేస్తాను అది సరేనా" రాజీమార్గంగా అన్నాడు శరత్.

'మీలో యింత కుళ్ళు మనస్సులో పేరుకొని పోయింది. అక్కడికే వెళ్ళండి. ఇంట్లో ఒక్క క్షణం మీరు వుండటానికి వీలులేదు" మతి పోయినట్లుగా పెద్ద పెద్దగా అరవసాగింది భారతి.

ఇరుగు పొరుగు వారు వింటారేమోనని శరత్ ఎంత బతిమాలినా ఇంకా ఎక్కువగా అరవటంతో ఏమీ చేయలేని శరత్ లాగి ఒక్క లెంపకాయ వేశాడు. అంతటిలో ఆమె లోనికి వెళ్ళి తలుపు వేసుకుంది. వారం రోజులు గడిచిన తరువాత ఒకరోజు ఏవో కొనటానికి బజారుకెళ్ళింది భారతి. ఆ షాపులో అనిత సేల్సు మేనేజరుగా వుంది. ఆశ్చర్యంతో చూసింది భారతి.

అనిత వెంటనే బయటకు వచ్చింది.

"ఏమిటి అనితా! ఇన్ని రోజులు ఎక్కడ వున్నావు?" భారతి అడిగింది. "అసలు ఎందుకు అప్పుడు అలా వెళ్లిపోయావు. మేమంతా నీవేమయ్యావో ఎక్కడ వున్నావో అని చాలా బాధపడ్డాం. మీ అన్నగారు పరేసరి నీమీద ఎంత ప్రేమో. రోజు నిన్ను తలచని రోజు లేదు."

"నేను అజయ్‌బాబు ప్రేమించుకున్నాము. నాన్న, మామయ్య ఇద్దరూ మా పెండ్లికి ఒప్పుకోలేదు, మా ఇద్దరికులాలు ఒకటి కాదని వాళ్ల అభియోగం. నాకు వేరే సంబంధం చూశారుకదా, అజయ్‌బాబు లేనిదే బ్రతుకే వృధా అనుకున్నాను. రిజిష్టర్ మేరేజీ చేసుకున్నాము" అంతాసంతోషంగానే చెప్పింది. "నిన్ను చూస్తే మీ అన్నగారు ఎంత సంతోషిస్తారో తెలుసా అనితా" అంది భారతి.

నేను యిక్కడ వున్నట్టుగా అన్నయ్యకు తెలుసు. నేను కనబడినట్లుగా నీకు గాని మామయ్యకుగాని చెప్పవద్దన్నాను, కులంలేని వాడిని పెండ్లిచేసుకొని మా వంశాన్ని పాడుచేసిందని నీవు, మామయ్యఅంటే మా అన్నయ్య మనస్సు నొచ్చుకుంటుందని, నేను కనపడినట్లుగా నీకు చెప్పననిమాట తీసుకున్నాము.

"నీవు వుద్యోగం చేస్తున్నావేమిటి నీ శ్రీవారు ఎక్కడ వున్నారు." భారతి ప్రశ్నించింది.

మా శ్రీవారు బి.ఎ. పాస్ అయినారు. కాని ఈ రోజుల్లో బి.ఎ. చదివితే ఏమి వుద్యోగం వస్తుంది చెప్పు.

కొన్ని రోజులు ప్రయివేటు కంపెనీలో జాబ్ చేశారు. ఈ మధ్య అదిపోయింది. అయినా అన్నయ్య హామీ వుండి బ్యాంకులో

(38 వ పేజీ చూడండి)

# దరికి పోలేని మరుగుదొడ్డి



## భారతదేశంలో, మరుగుదొడ్డి మలినమయిన పదం. అలాంటి అవసరం లేదు.

నిజానికి చాల మంది వారి మరుగుదొడ్డిని అశుభ్రంగా ఉంచేస్తారు. ఇంత అశ్రద్ధ ఇంట్లో మరి ఏ చోటా ఉండదు. కను మరుగయిన చోటు అవటంతో మనకి దానిపై ధ్యాస ఉండదు. కాని చూడండి:

**శుభ్రతలేని మరుగుదొడ్డిని చూడలేం, వాసన భరించలేం. అది చాలా అనారోగ్యకరం. శాస్త్రవిరుద్ధం. తప్పని సరిగా హానికరం కూడా.**

**ఇది మాత్రం ఏ మాత్రం హెచ్చు తగ్గులులేని పచ్చినిజం. కాబట్టి మిమ్మల్ని మీరే ప్రశ్నించుకోండి...**

**మీ మరుగుదొడ్డి మీరు నచ్చిన శుభ్రతతో ఉందా?**

దీనికి జవాబు తెలిసికొనవలసినవారు ఒక్కరే—మీరే మరి.

**ప్రతి ఉదయం దానిని శుభ్రపరచ టానికి పనివానిని నియమించినప్పటికీ, అతను చేయవలసినంత శుభ్రం చేస్తున్నాడా లేక అషామాషీగా చేసేస్తున్నాడా?**

వీటికి మీకు సరియైన జవాబు లేకపోతే, చూడండి—ఆ జవాబు ఇదే మరి... స్యానిఫ్రెష్.

**స్యానిఫ్రెష్ అంటే ఏమిటి?**

**స్యానిఫ్రెష్ మరుగుదొడ్డిని శుభ్రపరిచేది. అది మీ అసహ్యమయిన పనిని, మీకు చేసి పెడుతుంది. మొదట మరుగుదొడ్డిని ఫ్లష్ చేయండి. తరువాత స్యానిఫ్రెష్‌ను మరుగుదొడ్డి లోపల అంతా విరివిగా చల్లండి. 3-4 గంటలు అలా ఉంచండి. రాత్రి అంతా ఉంచితే మరీ మంచిది. తర్వాత తిరిగి ఫ్లష్ చెయ్యండి. ఫ్లష్ పని చేయని పక్షంలో, బకెట్టుతో నిండుగా నీళ్లని వదలండి. అంతే, మరి మీ శుభ్రం గురించిన సమస్య తీరిపోయినట్టే.**

**స్యానిఫ్రెష్ 3 విధాలుగా పనిచేస్తుంది:**

**1. స్యానిఫ్రెష్ పరిపూర్ణంగా శుభ్రం చేస్తుంది.**

అందులో ఎటువంటి మరకలనయినా మటుమాయం చేసే చురుకైన అంశం ఉంది. బ్రష్‌కు అందని భాగాలను కూడా శుభ్రం చేస్తుంది.

**2. స్యానిఫ్రెష్ హానికరమైన క్రిములను సంహరిస్తుంది.**

మరుగుదొడ్డి క్రిములు పుట్టి పెరిగే చోటు, తద్వారా అనారోగ్యాలకు మూలం. వీటినుండి మామూలు ఫినాయిలు ఇవ్వలేని రక్షణను స్యానిఫ్రెష్ ఇస్తుంది. కాబట్టి మీరు మీ మరుగుదొడ్డియొక్క బాగు ఓగులను గురించి నిశ్చింతగా ఉండవచ్చు.

**3. స్యానిఫ్రెష్ చెడు వాసనలను నిర్మూలిస్తుంది.**

మరుగుదొడ్డి భరించరాని వాసన వేయవచ్చు. సరియైన గాలి ప్రసారం లేక-ఈ సమస్య ఇంకా ప్రబలిపోతుంది. స్యానిఫ్రెష్‌లో ఈ చెడు వాసనలను చెదరగొట్టి మంచి వాతావరణాన్నిచ్చే డియోడరెంట్ ఉంది.

స్యానిఫ్రెష్‌ను ఎప్పుడు ఎన్నిసార్లు వాడుతుండాలి? దానికి జవాబు, మరుగుదొడ్డియొక్క శుభ్రతలోని ముఖ్యతను అనుసరించి, ఒకటే ఉంది. ప్రతి ఒక రోజూ.




**మీ మరుగుదొడ్డిని శుభ్రంగా ఉంచటానికి, మీ అసహ్యమైన పనిని, మీకు చేసి పెడుతుంది.**

**బల్సారా**
—సౌఖ్యమైన జీవనానికి అధునాతన సాధనాలు

BALSARA బల్సారా అండ్ కంపెని (ప్రై.) లి.
49, నగీన్‌దాస్ మాస్టర్ రోడ్, బొంబాయి-400 023.

CHAITRA-BLS-82 TEL

సీరియల్

# కనువిప్పు

వడ్లమన్నాటి లక్ష్మీ ప్రసన్న

(గత సంచిక తరువాయి)

నరసమ్మ కొత్తకోడలు ఎలా ఉంటుందో చూద్దాం! అనుకుంటూ అమ్మలక్కలంతా బిలబిల్లాడుతూ వచ్చారు ... పనులు మానుకుని. అప్పుడు ఉదయం ఏడుగంటలయింది. సాంబమూర్తి అప్పటికే పొలానికి వెళ్ళిపోయాడు ఎడ్లబండిని తోలుకుని. స్నానంచేసి జడ వేసుకుని బొట్టు పెట్టుకుని తల్లో మందారపువ్వు తురుముకుంది. "నీ కోడలు కేనమ్మా నరసమ్మా! కుందనపు బొమ్మయి లేను!" అంటూ ప్రశంసించారందరూ. నరసమ్మ ఏమీ మాట్లాడలేదు. కొన్ని క్షణాలు విశాలనింకా తనివితీరా చూసి వెళ్ళిపోయారక్కయ్యలు.

"ఏమేవ్! ఎక్కడ చచ్చావ్!" అన్న అత్తగారి గావుకేక విని పనిమనిషి ఆలస్యంగా వచ్చినందుకు మందలిస్తోంది గాబోలని ఇంట్లో మంచంమీదే కూర్చుండి పోయింది విశాల. ఆమె మనసు నిండా సాంబమూర్తి చిలిపి చేష్టల మీద ఆలోచనలే! దబ దబ మంటూ నడచివస్తున్న అడుగుల చప్పుడు విని ఛటుక్కున తలతిప్పి చూసింది. అంతే!! నిర్ఘాంతపోయింది విశాల. అయితే...అయితే...

ఇందాకత్తగారన్న మాటలు తననుద్దేశించి అన్నవేనన్నమాట! "ఏమేవ్ ఎక్కడ చచ్చావ్!" ఎంత కఠినంగా పరుషంగా మాట్లాడిందత్తగారు! ఇంతవరకూ తను పుట్టింట్లో పీసమెత్తు మాట గూడా పడలేదు తల్లిదండ్రులతో సరిగదా! తననో అపరంజి బొమ్మలా పెంచారు! అసలు అత్తగారికి తన మీదాగ్రహ మెందుకు వచ్చింది? ఏమిటీ ఉగ్రనరసింహావతారంతో చీపురుకట్ట పుచ్చుకుని నిలబడింది? తనేం తప్పు చేసిందని! మనసులో నుంచి పుబికి వస్తున్న దుఃఖాన్ని అసహాయంగా అణుచుకుని...లేచినిల్చుని ఎలాగో గొంతు పెగుల్చుకుని 'ఏమిటత్తగారూ నేనేం తప్పు చేశాను...?' అంది విశాల అమాయకంగా ముఖం పెట్టి.

"ఏం చేశానని ఎదురు మాట్లాడుతున్నావుటే ఇంకా ... నువ్వేం చేశావో నీకు తెలియకుండానే ఉందటె? సిబ్బి ముఖం నువ్వూను!"

విశాల మనసు మూగగా రోదించింది. "అమ్మలక్కలకు తను కుందనపు బొమ్మ! అత్తగారికి మాత్రం అట్లసిబ్బి ముఖం! హుం! అదలా ఉంచి నీకు తెలియదా నువ్వేం చేశావో? అంటుందేమిటిది?"

"మీ రేమంటున్నారో తెలియటంలేదత్తగారూ!" అంది విశాల బిక్కుబిక్కుమంటూ.

"తెలియదే! తెలియదు! పుట్టింట్లో సరిగ్గా నేర్పితేనేగా తెలియటానికి. మా బాగా ఉందమ్మా ఆ తల్లి పెంపకం ఈ పిల్ల తీరూను!"

ఏదో పని చెయ్యాలని ఆవిడ వుద్దేశ్యమయింటుందని ఊహించింది విశాల. "దానికింత రాద్ధాంత మెందుకూ? చెయ్యి! అని చెపితే తను చెయ్యనని ఏమీ అనలేదుగా!" అని మనసులో అనుకున్నది విశాల.

"ఏ పని చెయ్యాలో చెప్పండత్తగారూ! చేస్తాను! ఇంత మాత్రానికే మా అమ్మ మాటెందుకులెండీ" అంది బయటకు.

"అంటానే అంటాను! మీ అమ్మనేగాదు అవసరమయితే మీ అబ్బనుగూడా అంటాను— నువ్వు చేసే పనులకు అనక వదలిపెడతానను కుంటున్నావేమిటి? అసలిప్పుడెంతయింది... ఎంతయిందీ అంట! సూర్యుడు బారెడు పైకొచ్చాడు గదా! నాపసానిలా సింగారించుకుని ఇంట్లో మంచంమీద కూర్చుని కులుకుదామనుకున్నావా? చీపురు తీసుకొని ఇల్లూ వాకిళ్ళూ ఊడవాలని తెలియదూ?" తర్జనితో బెదిరిస్తూ అంది నరసమ్మ.

"పనిమనుషుల్లేరా అత్తగారూ?" అంది మెల్లగా.

"ఉంటారే! ఉంటారు! ఇది మీ పుట్టిల్లు కాదు! అడుగడుక్కూ పనిమనుషులుంటానికి! మీ ఇంట్లోలా పనిమనుషుల్ని నౌకర్లని పెట్టుకుంటే ఇక చిప్ప చేతి కొచ్చినట్టే! ఇన్నాళ్ళనుంచీ ఈ పనులన్నీ నేనే చేసుకుంటున్నాను. కోడలును తెచ్చుకున్న తర్వాత నాకేం ఖర్మ! ఊ! పద! ఇంకా నిల్చున్నావే! గడక్రరలాగ! ఇదుగో చీపురు ఇల్లు వాకిళ్ళు అద్దంలా శుభ్రంగా ఉండకపోతే ఊర్కోను! తెలిసిందా?" అంటూ చీపురు తన ముఖాన పారేసి విసవిసా నడుచుకుంటూ దొడ్లోకి వెళ్ళిపోయింది.

విశాలకీ అప్రయత్నంగా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఇదన్నమాట అత్తగారి నిజ స్వరూపం! ఇదన్నమాట! ఆమె ఇంతకు ముందు పాటించిన మౌనానికంతరార్థం! సరే! తప్పేదేముంది? అత్తవారింటి కొచ్చిన కొత్తకోడలు చెయ్యనని... అలవాటు లేదని అంటానికెలా వీలవుతుంది? అని తర్కించుకున్న విశాల పమిటకొంగుతో కళ్ళు తుడుచుకుని చీపురు తీసుకుని వాకిట్లోకి నీరసంగా నడిచింది.

*   *   *

ఎండలో తను వాకిలి ఊడుస్తుంటే పక్కింటి ఆడవాళ్ళు ఒకరిద్దరు అనుకునే మాటలు అప్రయత్నంగానే చెవినబడ్డాయి విశాలకు.

"చూడవే ఆ అత్తముండ కొత్తకోడలుతో అప్పుడే ఎలా పని చేయిస్తోందో?" అని ఒకామె అంటే ఇంకో ఆమె.

"ఏవిటోపాపం సుకుమారిలా ఉందా అమ్మాయి! ఈ రాక్షసిముండ చేతుల్లో ఏవుమతుందో ఏమో? అయినా మన కెందుకులే! దెయ్యం విందంటే ఇంత నోరేసుకుని మరీ పడుతుంది" అంటూ నూతిలో చేదవేసి నీళ్ళు తోడుకోసాగింది.

వాకిలి ఊడుస్తున్న విశాలకా మాటలతో నవనాడులు కుంగిపోయాయి. పులిగుహలో జొరబడ్డ మేకపిల్ల చందమయ్యిందన్న మాట! తన బ్రతుకు! మరి తన తల్లిదండ్రులకీమె గుణం ముందే తెలియదా? తెలిసుండదు. తెలిస్తే చూస్తూ చూస్తూ ఇలాంటిచోట పడేస్తారా తనను? వాళ్ళంతా

జరిగినకథ: 1 అల్లారుముద్దుగా పెంచుకున్న కూతురు విశాలను సాంబమూర్తికిచ్చి పెళ్ళి చేస్తారు సరస్వతమ్మ వెంకట్రామయ్యలు. విశాల అత్తగారు నరసమ్మ.

నిస్సత్తువ ఆవహించగా యాంత్రికంగా ఊడవ సాగింది విశా.

"ఏం మహారాణీ! ఇంకా వాకిలి ఊడవటమే కాలేదన్నమాట! ఇలా అయితే ఇల్లు, వాకిళ్లు ఊడవటానికి నీకు రెండు రోజులు కావాలా ?"

నరసమ్మ వ్యంగోక్తులకు విశాల ముఖం చిన్నబోయింది. ఏమనలేక ఇంకా వేగంగా ఊడవసాగింది. మొత్తం ఊడుపు...వాకిట్లో నీళ్లుచల్లి ముగ్గు వేసేవరకూ ఎన్నోసార్లు సూటీపోటీలతో అదలించింది. నరసమ్మ పైగా చివరలో "నీలాంటి కోడలుంటే చాలు ... పొద్దెక్కిం తర్వాతగానీ నరసమ్మకు వాకిలి ఊడ్పించి నీళ్లు చల్లించి ముగ్గు వేయించటం రాదనినిందమోసి చావాల్సిందే! నేను!" అంది గట్టిగా. ఆమె లనే మాటలు ఎదురింటి గుమ్మంలో కూచున్న మరో అత్త గారు వినాలని ఆమె తాపత్రయం.

అలవాటులేని, ఆపోశనం అవటంవల్ల ... విశాలకు నడుమంతా నెప్పిపుట్టి పట్టేసినట్లయింది. చేతివేళ్ల నరాలు పీకుతున్నట్లు బాధగా ఉన్నాయి. అప్పటికి టైము ఎనిమిది అయింది కాఫీ ఫలహారాల జాడే ఉన్నట్టు లేదింట్లో. ఇదే పుట్టింట్లో అయితే ఈ పాటికి సుష్టుగా టిఫిన్ పెట్టేదమ్మ. గ్లాసుడు చిక్కటి కాఫీ కలిపి ఇచ్చి "చాలా ఇంకా కావాలా ? విశాల తల్లీ!" అనేది.

"కాఫీ కావాలి! టిఫిన్ కావాలి!" అని



## రాలిన ముత్యాలు

.........శ్రీ సోమసుందర్.........

పగలు కగ్గిపోయే
గాజు ముక్కల్ని
వజ్రాలనుకుని మురిసే నింగికి
పాపం-అవి పుట్టుమచ్చలని తెలియదు!

అత్తగార్నెలా అడగ్గలదు. అందుకని ఆకలి కడుపుతో అలాగే కూర్చుండిపోయింది సెట్టింట్లో.

"ఏం పాపం అలిసొచ్చిందా? ఇదుగో! కాఫీ కలుపుకొచ్చాను. సేవించు పాపం!" అంటూ ఓ చిన్నగ్లాసు విశాలముందు నేల కేసి రకీమని కొట్టినట్లు పెట్టింది. దానిలో ఎక్కడో అడుగుభాగాన ఓ రెండు గుక్కల కాఫీ ఉంటుందేమో! తను మాత్రం ఓ చెయ్యపు గ్లాసు అంచులవరకూ కాఫీ పోసు

## కను విప్పు

కుని చిద్విలాసంగా పీలుస్తూ తాగసాగింది. చిప్పున కళ్లల్లో నీళ్లు తిరిగాయి మళ్లీ విశాలకు. అది అత్త గమనిస్తే ఇంకెంత గొడవవుతుందోనని తల దించుకునే ఆ చాలీ చాలని కాఫీ తాగేసింది. పొద్దున్నే వెళ్లిన కొడుక్కు రహస్యంగా దిబ్బరొట్టె పొట్లం కట్టిచ్చిందని... ఇందాక తన చెమ్మలక్కలు పరామర్శిస్తున్నప్పుడు అత్త ఆ మిగిలిన పెద్ద ముక్కకాస్తా మింగేసిందని విశాలకేం తెల్సు పాపం?

"గటగటా కాఫీ తాగావుగా ఇంకా ఆ ఏడుపుముఖ మెందుకూ? పద పద! దొడ్లో అంట్లు అట్టాగే ఉండిపోయినయ్! ఊరికే ఇంత చింతపండు వాటి ఏదానపెట్టే కొంప గుండం చెయ్యక తళతళలాడేట్లు తోము. నుసి మరక కనిపించిందో..." ఉరుముతూ ఆజ్ఞాపించింది నరసమ్మ. మెల్లిగా అడుగులు వేసుకుంటూ దొడ్లోకివెళ్లి అక్కడున్న అంట్లను చూసి నివ్వెరపోయింది విశాల. ఇంట్లో మనుషులు పెద్దగాలేరు ఇన్ని అంట్లు ఎలా వచ్చాయో ఆమె కర్థం కాలేదు. కక్కలేని బాధ మింగివేసి ఇసుకతో కొంచెం చింతపండులో అంట్లు తోమటం మొదలుపెట్టింది. అంట్లు తొలిచేటప్పుడు ఆమె కన్నీళ్లు నుండి రాలేకన్నీటి బిందువులు గూడా ఆ నీటిలో కలిసిపోతున్నాయి. నీ కన్నీటికి ఇంట్లో విలువలేదుసుమా! సానుభూతి లభించదు సుమా! అన్నట్లుగా. అంట్లు తోమిన తరువాత అరచేతులు చూసుకున్న విశాలకు మంట పెడుతున్న బొబ్బలు కనిపించాయి. "హు! నందనవనం నా జీవితం!" అనుకుంది. అంతేగాదు తనలో తాను తర్కించుకుంది. ఒకవేళ తనదే తప్పేమోనని ... పని చెయ్యటం అలవాటులేక పని కొత్తగా చెయ్యాల్సి వచ్చేసరికి అనవసరంగా బాధ పడుతున్నానేమోనని పడయితే

(29వ పేజీ చూడండి)









DC.G.49. TL (I

# లాక్మే వానిషింగ్ క్రీం

అందాలు చిమ్ముతూ ఆకర్షణ వెద చల్లితే

మీదారి పొడవునా
చూపుల తోరణాలే




చూపుల వయులులో మైమరచి
పొండి లాక్మే వానిషింగ్
క్రీం మీ చర్మాన్ని అందంగా—
తాజాగా వుంచుతుంది.
మృదువుగా, సహజంగా,
మేకప్‌కు ఆదర్శవంతమైన
ఆధారం లాక్మే వానిషింగ్ క్రీం
మీ సౌందర్య పోషణ
మా ఏకైక ఆశయం

లాక్మే

# లాక్మే లావెండర్ టాల్క్

## పరిమళ సౌరభం... ఫ్రెంచివారి అనుభూతిపై



లాక్మే లావెండర్ టాల్క్
రాసుకోండి. అసలైన
ఫ్రెంచి లావెండర్ యొక్క
అపురూపమైన,
లావణ్య సువాసన.
లాక్మే లావెండర్
టాల్క్




dCA/L-VC-LT/1J TEL.





'రాజు వెడలె'లో జయసుధ, శోభన్ — 'కొల్లేటి కాపురం'లో కృష్ణ, ప్రభ

### కృష్ణకు శోభన్ ప్రశంస

విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్‌వారి ''మొనగాడు'' వర్ణ చిత్రం షూటింగు పూర్తయింది ఈ చిత్రంలో రవిగా, రాజాగా హీ–మాన్ ద్విపాత్రాభినయం చేశారు ఆయన సరసన మంజుల జయసుధ నటించారు

ప్రేక్షకులు ఆశించే అన్నీ వున్న చిత్రం ''మొనగాడు'' చిత్రం ఆద్యంతం రక్తి కట్టించడానికి దర్శకుడు కృష్ణ కృషిని ప్రేక్షకులు హర్షించగలరు

''కృష్ణ యీజ్ ఎ జీనియస్'' అన్నారు

'సీతా కళ్యాణం'లో సత్యనారాయణ



## * సినిమావిశేషాలు *

హీ–మాన్ అభిరుచి వున్న నిర్మాతగా త్రివిక్రమరావును పేర్కొన్నారు

### వచ్చే ఏడు రెండవ చిత్రం

విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ పట్ల శోభన్‌కు ప్రత్యేక అభిమానం వుంది సంవత్సరానికి ఒక చిత్రం త్రివిక్రమరావుకు చెయ్యాలనుకుంటున్నారు, శోభన్

### వెరైటీ వేషాలు !

శోభన్‌బాబు నటించిన చిత్రాలు నిర్మాతలకు నష్టం రానివ్వవు అని యిటీవల విడుదలయిన ''పిచ్చిమారాజు, ఇద్దరూ యిద్దరే'' నిరూపించాయి ఈ రెండు చిత్రాలు దెబ్బతిన్నాయి అని పరిశ్రమలో కొందరనుకున్నారు. కానీ, ఎగ్జిబిటర్లను అడిగితే, రెండు చిత్రాలకు వచ్చిన వసూళ్లను, లాభాలను వెల్లడించారు

యువతరం కోరే కథానాయకుడు శోభన్‌బాబు అనేడి నిజాన్ని నేను గ్రహించాను.

రాబోయే చిత్రాలన్నీ ఆర్థికంగా బాగుండగలవని రాయడానికి యీవిలేఖరికి ఆధారం లేకపోలేదు

''రాజు వెడలె'' చిత్రంలోని శోభన్ పాత్రకు, ''మొనగాడు''లోని రెండు పాత్రలకు, ''పొగరుబోతు'' చిత్రంలోని పాత్రకు ఎంతో వ్యత్యాసం వున్న నిజాన్ని ప్రేక్షకులు అంగీకరించి, ఆశీర్వదించగలరు

యాక్షన్ చిత్రాలపట్ల ప్రజలు ఎక్కువ మక్కువపడుతున్న నిజాన్ని గ్రహించిన శోభన్, అట్టి పాత్రలనే ఎంపిక చేస్తున్నారు

ఎన్నాళ్లనుంచో కృష్ణ పాత్రను పోషించాలన్న శోభన్‌కు, 'కురుక్షేత్రం' అవకాశాన్ని యిచ్చింది

కృష్ణుడుగా రాణించడానికి, ఆ పాత్రను ప్రజలు మెచ్చడానికి తీవ్ర కృషి సలపగలనని పత్రికాముఖంగా తెలుపుతున్నారు

### శ్రీరాముడుగా రామకృష్ణ

విగ్రహపుష్టి, వాక్ పుష్టి, నటనా పుష్టి వున్న రామకృష్ణ రఘుకుల దీపకుడుగా ''శ్రీరామ వనవాసం'' చిత్రంలో నటిస్తున్నారు

పి ఎన్ ఆర్ పిక్చర్స్ నిర్మిస్తున్న ''శ్రీరామ వనవాసం'' చిత్రానికి ఎస్ హనుమంతరావు సంగీతాన్ని, కుదరవల్లి కళను, ప్రసాద్ ఛాయా గ్రహణాన్ని నిర్వహిస్తున్నారు

'సీత'గా జయప్రద నటించగలదని, దశరథ మహారాజుగా గుమ్మడి వుండగలరని, దర్శకత్వాన్ని కమలాకర కామేశ్వరరావు నిర్వహించగలరని, నిర్మాత పి నాగేశ్వరరావు చెప్పారు



'మంచిరోజు'లో రామకృష్ణ, జమున



'భక్త కన్నప్ప'లో కృష్ణంరాజు

### సీతా కళ్యాణం !

విఖ్యాత దర్శకుడు బాపుగారి రూపకల్పనలో "సీతా కళ్యాణం" రమణీయంగా రూపొందిన నిజాన్ని, అనేకులు వెల్లడించారు

చిత్రాన్ని చూచిన అందరిదీ ఒకేమాట "సీతాకళ్యాణం మార్వలస్‌గా వుంది. సీతారాములు బంగారుబొమ్మలువలె వున్నారు. రమణగారి రచన సొరస్యంగా వుంది. బాపుగారి శక్తి ఆద్యంతం అగుపించింది "

### ఎన్టీఆర్ తలపెట్టిన చిత్రాలు

"ప్రజానటుడు" ఎన్టీఆర్‌ను యిటీవల కలిసినప్పుడు, ఆయన చిత్ర ప్రణాళికను వెల్లడించారు

రామకృష్ణ సినీ స్టుడియోస్ భారీ ఎత్తున రెండు చిత్రాలను తలపెట్టినట్టు, ఆయన చెప్పారు

### చాణక్య చంద్రగుప్త

మహానటులని ప్రేక్షకులచేత, అద్వితీయులని పరిశ్రమచేత కీర్తింపబడుతున్న అక్కినేని, నందమూరిగార్లు కలిసి నటిస్తున్న "చాణక్య చంద్రగుప్త" వర్ణ చిత్రం షూటింగు "జూన్"లో ప్రారంభమై, సెప్టెంబరుకు పూర్తి అవుతుందని పాఠకులకు తెలిపి రెండు వారాలు దాటింది

చాణక్య పాత్రను, చంద్రగుప్త పాత్రను నాగేశ్వరరావు, రామారావుగార్లు పోషిస్తున్నారు చిత్రంలోని ప్రధాన పాత్రలకు మంజుల, జయప్రద, ప్రభాకరరెడ్డి, రావు గోపాలరావు, పద్మనాభం, రాజబాబు, మరియు సత్యనారాయణగార్లను ఎంపిక చేసినట్టు, దర్శకుడు "నటరత్న" చెప్పారు

### పెండ్యాల . కన్నప్ప

"చాణక్య చంద్రగుప్త" చిత్రానికి పెండ్యాల సంగీతాన్ని, కన్నప్ప ఛాయాగ్రహణాన్ని నిర్వహిస్తున్నట్టు ఎన్టీఆర్ చెప్పారు

('మనుషులంతా ఒక్కటే' చిత్రానికి "కన్నప్ప" ఛాయాగ్రహణం ఎంతగానో సహకరించింది )

### దాన వీర శూర కర్ణ !

"సెప్టెంబరుకల్లా "చాణక్య చంద్రగుప్త" పూర్తవుతుంది సెప్టెంబరు నుంచి "దాన వీర శూర కర్ణ" చిత్రం ప్రారంభమవుతుంది", అన్నారు నందమూరి

### త్రిపాత్రాభినయం !

"దాన వీర శూర కర్ణ" చిత్రంలో కృష్ణుడుగా, సుయోధనుడుగా, కర్ణుడుగా రామారావు త్రిపాత్రాభినయం చేస్తారు ఈ చిత్రానికి సంబంధించిన పాటలు, పద్యాలు రికార్డు చెయ్యబడి చాలా రోజులైంది

(కృష్ణుడు పాత్రను నాగేశ్వరరావుగారు చెయ్యనని చెప్పడంవల్ల, చాణక్య చిత్ర నిర్మాణం మొదటిదయ్యింది )

### బాలకృష్ణ నాయకత్వం

"ఫ్యూచర్ హోప్ ఆఫ్ ది యిండస్ట్రీ"గా చిరంజీవి బాలకృష్ణను ఎందరో వూహిస్తున్నారు మరి బాలకృష్ణ నాయకత్వంలో చిత్రం ఏదేని వుందా అని ఎన్టీఆర్‌ను ప్రశ్నించాను

"ఒక రొమాంటిక్ సోషల్ బాలకృష్ణ కోసం రాయించదలచాను" అన్నారు రామారావు

### నవంబరు నుంచి సత్యచిత్ర

సత్యచిత్రకు నవంబరు నుంచి పని చెయ్యడానికి తను అంగీకరించినట్టు, రామారావు చెప్పారు అభిరుచి వున్న సత్యచిత్ర అధినేతలకు రామారావుగారి అంగీకారం నూతనోత్సాహాన్ని యివ్వగలదు

### నిర్మాతల పరంపర !

రోజూ రామారావుగారి యింట పదిమంది నిర్మాతలు ఆయన "అవును" కోసం వుంటున్న నిజాన్ని నే కళ్లారా చూశాను

ఒందరినీ చిరునవ్వుతో ఆహ్వానించి, అలాగే చూద్దాంలెండి అనెడి "నటరత్న"గారి మృదు భాషణాన్ని నే చెవులారా విన్నాను మూడు పదులు దాటినా, మునుపటివలె వున్నది, ఎన్టీఆర్ డిమాండు

'నాపేరే భగవాన్'లో ఒక దృశ్యం



'తూర్పు – పడమర'లో శ్రీవిద్య




'వస్తాడే మా బావ'లో రోజారమణి

## శారద, రామకృష్ణ ప్రేమ ఫలించింది

ఒకే ఆఫీసులో పనిచేసే శారద రామకృష్ణల మధ్య ప్రేమ చిగురించి, అది దిన దిన ప్రవర్ధమానమై పరిణయానికి దారితీసింది "నువ్వు లేని క్షణము నాకొక యుగము" అని యిద్దరూ నిర్ణయించారు

వివాహంకోసం యిద్దరూ తహతహలాడారు పెండ్లికి పురోహితుడు లేడాయె! గుడిలో పెండ్లి జరిగింది నవదంపతులు పైరుగాలి తాకిడికి పరవశం చెందారు

## శోభానాయుడు నృత్యం

శ్రీ వెంపటి చినసత్యం శిష్యురాలు కుమారి శోభా నాయుడు ఏప్రిల్ 10 న విజయవాడ త్యాగరాయ సంగీత కళా సమితి ఆధ్వర్యంలో మూడు గంటలకు పైగా కూచిపూడి నృత్య ప్రదర్శన లిచ్చి ప్రముఖుల మన్నన లందుకుంది ఈమెతోపాటు కుమారి అనుపమ, కుమారిబాల కూడా విడి విడిగా అదే వేదికపై నృత్య ప్రదర్శన లిచ్చారు కుమారి శోభానాయుడు దేశ విదేశాలలో ఎన్నో నాట్య ప్రదర్శన లిచ్చింది ఆమె అభిమాన నాట్యతారలు బాలసరస్వతి, కమలా లక్ష్మణ్, వేదాంతం సత్యనారాయణశర్మ లని తెలిసింది [ఒ వి]



# సినిమా

"శుభమస్తు శుభమస్తు
అన్నదే గుడిగంట
తథాస్తు . తథాస్తు
అనుకున్నదే మన జంట" అంటూ ప్రేమ సామ్రాజ్యాన్ని పాలించసాగారు

ఈ ప్రేమ ఘట్టం "శిలానికి శిక్ష" చిత్రంలో కనిపిస్తుంది

## తొలి చిత్రం!

'ఊర్వశి' శారద, రామకృష్ణ కలిసి నటిస్తున్న తొలి చిత్రం "శిలానికి శిక్ష" ఈ చిత్రానికి డి ఎస్. ప్రకాశరావు దర్శకుడు.

## అంతా అవుట్ డోరే!

సావరిన్ సినీ ఎంటర్ ప్రైజస్ నిర్మిస్తున్న "శిలానికి శిక్ష" చిత్రం స్టుడియో ప్రమేయం లేకుండా, అంతా అవుట్ డోర్ లోనే పూర్తవుతూంది

"నిడదవోలు, భీమవరం, రాజమండ్రి, పురుషోత్తమపల్లె" మున్నగు ప్రాంతాల్లో "శిలానికి శిక్ష" షూటింగు నెలనాళ్లు జరిగింది మరో వారంరోజులు షూటింగు జరిగితే, చిత్రం పూర్తవుతుంది

"శిలానికి శిక్ష" చిత్రానికి మహదేవన్, గొల్లపూడి, లక్ష్మణగోరే, ప్రకాశరావు ముఖ్య సాంకేతిక సారథులు

చిత్రంలోని ప్రధాన పాత్రలను సత్యనారాయణ, అల్లురామలింగయ్య, రమాప్రభ, కె విజయ, కె కె శర్మ, ధూళిపాళ, పుష్పకుమారి, పండరీబాయి, శ్యాంసుందర్ పోషిస్తున్నారు

ఇమ్మణి శేషగిరిరావు సమర్పించు "శిలానికి శిక్ష" చిత్రాన్ని ఎ ఎస్ ఆర్ శర్మ నిర్మించ, శ్రీసిలిన్స్ విడుదల చేస్తారు.

## నవ్వుతూ బ్రతకాలి!

"జీవితంలో కష్టాలు, నష్టాలు, లాభ, ప్రయోజనాలు వచ్చిపోతుంటాయి కష్టం వచ్చినా తట్టుకుని, నవ్వుతూ జీవితాన్ని గడిపితే, వెన్నెల కురియకపోదు", అనేది అంశంపై అల్లబడిన కథ "నవ్వుతూ బ్రతకాలి"

నరేంద్ర ప్రొడక్షన్స్ తలపెట్టిన "నవ్వుతూ బ్రతకాలి" చిత్రం ఏప్రిల్ 19న ప్రారంభమైంది ప్రముఖ చిత్ర నిర్మాత ఎం. ఎస్. రెడ్డిగారు క్లాప్ కొట్టారు జయలక్ష్మీ నాగేశ్వరరావుగారు స్విచ్ ఆన్ చేశారు

మొదటి షాటులో కాంచన . . రంగనాథ్ పాల్గొన్నారు

## డ్యూయెట్ చిత్రీకరణ!

తొలి రెండురోజులు రంగనాథ్ కాంచన పాడిన యుగళగీతాన్ని మదరాసులోని మధురతర ప్రదేశాల్లో చిత్రీకరించారు

"సింతాసిగురులాంటి సినదానా
సొగసంతా నీ వయసంతా
బలేగ వున్నదిలే అది అంతా నాదేలే"
అంటూ రంగనాథ్ వెంటబడితే,


'దొంగల దోపిడీ'లో మంజుల, కృష్ణ

"సీమా దొరలాంటి సినవాడా
వలపంతా నీ మనసంతా
బలేగా వున్నదిలే అది అంతా నాదేలే"
అంటూ కాంచన అతని యదలో తలదాల్చింది

ఈ ప్రేమ పాటను దాశరథి వ్రాశారు. జి కె వెంకటేష్ సంగీత సారధ్యంలో బాలు . కొత్త గాయని వేదవతి పాడారు

"నవ్వుతూ బ్రతకాలి" చిత్రంలో గుమ్మడి అంజలీదేవి, చంద్రమోహన్ సత్యప్రియ, కె వి చలం రమాప్రభ, ముక్కామల కమల, శరత్ బాబు ప్రధాన పాత్రధారులు

ఈ చిత్రాన్ని కె శ్రీనివాసరావు, కె బి సూర్యనారాయణరావు, నల్లంరెడ్డి ప్రసాద్ నిర్మిస్తున్నారు

కథను లక్ష్మీదేవి వ్రాయ, పి ని శెట్టి మాటలను రచించారు

### అక్కినేనితో ఒకరోజు

ఈమధ్య హైద్రాబాద్ వెళ్లాను. అన్నపూర్ణ స్టుడియోస్ అధినేతను కలిశాను. నే వెళ్లినరోజున, అమెరికా నుండి వచ్చిన మనవరాలి ఫొటోలను తిలకిస్తూ, ఆనందాన్ని అందరికీ పంచిపెట్టారు.

("నటసామ్రాట్"కు మనవరాలు పుట్టిన వార్తను పాఠకులకు గత వారం తెలిపాను.)

### అమెరికా యాత్ర !

మనవరాలి పేరు సుప్రియ. తన ముద్దుల మనవరాలిని చూడడానికి అక్కినేని ' అమెరికా (మే 15 న) వెళ్తున్నారు. ఇరవై రోజులు అక్కడ వుండి, స్వదేశానికి తిరిగొస్తారు. టెక్నికల్‌గా (సినిమారంగం) సాధించిన విజయాలను పరిశీలించి, అవి ఆచరణయోగ్యమయితె తన స్టుడియోలో ప్రవేశపెట్టగలరన్న నిజాన్ని ఆయన మాటల్లో పసిగట్టాను.



'జ్యోతి'లో సత్యనారాయణ, జయసుధ



'సెక్రటరీ'లో కాంచన, అక్కినేని

### నాలుగు రెడీ

"రాబోయే సెప్టెంబరునాటికి అన్నపూర్ణా స్టుడియోస్‌లో యిప్పుడున్న రెండుగాక మరో రెండు ఫ్లోర్లు రెడీ అవుతాయి, అన్నారు అక్కినేని.

జూన్‌కల్లా డబ్బింగు థియేటరు, కారు షెడ్డు, సైకిల్ షెడ్డు, వి. ఐ. పి. గెస్టుహావుస్" రెడీ కాగలవన్న నిజాన్ని నేను చూశాను.

తన చిత్రాలు గాక, యితరులు నటించే వాటికి కూడా అన్నపూర్ణా స్టుడియోస్‌లో ప్రొవిజన్ వుంది, అన్నారు అగ్రనటుడు.

### అంగీకరించిన చిత్రాలు

ఈ ఏడు చెయ్యడానికి అంగీకరించిన చిత్రాలు : "మహాత్ముడు, చాణక్య...చంద్రగుప్త, చక్రధారి, బంగారుబొమ్మలు, ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్."

### బంగారుబొమ్మలు ప్రత్యేకత

జగపతి రాజేంద్రప్రసాద్‌గారి "బంగారు బొమ్మలు" చిత్రాన్ని గూర్చి, అక్కినేని అర్ధగంటసేపు ప్రశంసించి, ఆ సంస్థపట్ల తనకున్న ప్రేమాభిమానాలను వ్యక్తపరచారు.

"బంగారు బొమ్మలు" చిత్రంలో మధురానుభూతిని కలిగించే పాత్ర తనకు లభించినట్టు, అక్కినేని అన్నారు.

ఆ పాత్రలో "మజ్ను ... సలీం ... కళ్యాణ్... మూగమనసులు గోపీ వున్నారని, ప్రేక్షకులు ఆశించే అన్ని అంశాలు, హంగులు వున్నాయని 'నటసమ్రాట్' చెప్పారు.

ప్రజలు కోరే పద్ధతిలోనే తన పాత్రల రూపకల్పన వుండగలదని నాగేశ్వరరావు వెల్లడించారు.

### శారద బాలాకుమారి

రాజేశ్వరీ చిత్ర వారి "మహాత్ముడు" వర్ణ చిత్రంలో అక్కినేని ... శారద ప్రేమ జంటగా నటిస్తున్నారు.

రెండేండ్ల తరువాత నాగేశ్వరరావు...శారద కలిసి నటిస్తున్న చిత్రం "మహాత్ముడు."

ఏప్రిల్ 16 నుండి 28 వరకు అన్నపూర్ణా స్టుడియోస్‌లో అక్కినేని ... శారద పాల్గొన్న దృశ్యాలను దర్శకుడు గోపీనాథ్ చిత్రీకరించారు.

"నేను లావెక్కానా" అంది శారద. "లేదే... నాకు సరిపడ వున్నావు", అన్నారు అక్కినేని. "నువ్వు బాలాకుమారివి" అని నాగేశ్వరరావు అన్నప్పుడు, ఆమె ముఖం ఎంతగా వికసించిందో.

"అక్కినేని...శారద" కాంబినేషన్ కన్నుల పండుగ చెయ్యగలదు.

### మహాత్ముడు

చిత్రం ఉగాది నుంచి నిర్విరామంగా షూటింగు జరుపుకుంటూంది. (అన్నపూర్ణా స్టుడియోస్‌లో). మార్చి 31 నుంచి ఏప్రిల్ 30 వరకు జరిగిన షూటింగు పదకొండు రీళ్లకు దోహదం చేసింది.

మే 18 తో "మహాత్ముడు" ఇన్‌డోర్ పూర్తవుతుందని, జులైలో పాటల చిత్రీకరణ పూర్తయితె, ఆగస్టు 15 కు చిత్రం విడుదలవుతుందని, నిర్మాత ... దర్శకుడు గోపీనాథ్ చెప్పారు.

### మకుటం సమంజసమే !

ప్రేమించిన యువతిని అన్నయ్యకు త్యాగం చెయ్యడం, ఎవరో కన్నబిడ్డకు తండ్రిగా అంగీకరించడం, దొంగల్లో మానవత్వాన్ని తీసుకు రావడం ... కథానాయకుని పాత్ర లక్షణం గాబట్టి చిత్రానికి "మహాత్ముడు" సరయిన మకుటం అని కథకుడు గోపీనాథ్ వివరించారు.

— శ్రీనివాస్



'అదృష్టవంతురాలు'లో చలం, ప్రభ







# mummy, do you know The Bonnie Baby 'Club' is extended to JUNE 30, 1976 and is now open in many more cities?

## How well do you know your baby?

Try this quiz and learn a thing or two!
(Answers at bottom of next page)



1. New-born babies are startled by loud noises and sudden changes in position.
   **True** ☐ **False** ☐
2. Babies only cry when they are hungry.
   **True** ☐ **False** ☐
3. Cradle cap is what baby wears when he goes to bed.
   **True** ☐ **False** ☐
4. Scurvy is caused by a deficiency of vitamin D.
   **True** ☐ **False** ☐

**Yes, mothers, applications for membership will now be accepted till June 30, 1976.**
And you can redeem your gift vouchers from any one of the cities given below.
What a fantabulous chance of making your baby a member of this exclusive club! And there is no entrance fee either!

So act NOW! Enrol your baby TODAY! Get FREE gifts worth Rs. 30!

## How to look after baby's constitution

**— a word from the doctor.**

Ordinary laxatives are too strong for baby. For regular bowel movements, try this simple formula that will keep baby comfortable.

Soak a few dried figs or currants in water, and leave overnight. Mash well in the same water next morning, strain and give baby a spoonful or two of it.



FREE GIFTS MUST BE COLLECTED PERSONALLY FROM SPECIAL CENTRES (GIVEN IN GIFT VOUCHERS) IN....



Interpub/GL/6/76















# FREE!
## GIFTS WORTH Rs.30/-

**On becoming a member, you get the following.**

**FREE!** BOOKLETS on baby care, baby names and a baby diary

**FREE!** **When baby is ready for bottle-feeding.** A tin of Glaxo Sunshine or Ostermilk (500 g) so baby can be bubblier, bouncier, livelier!

**FREE!** **When baby is three months old** A tin of Farex, the ideal weaning food for health and growth, and a packet of Glaxose-D (100 g) the delicious energy-giver for zest and zip!

**FREE!** **Baby Care Advice**: Glaxo, specialists in baby care, will be happy to advise you on the general health and care of your baby

## Here's all you do to enrol



1) Cut out the Coupon and fill in all details in English in block letters
2) Get your Doctor's signature on the Coupon and mail it to The Bonnie Baby 'Club', Glaxo Laboratories (India) Ltd., Bag No 19119, Bombay 400 025
3) On verification, we will send you your membership card, free booklets and gift vouchers with instructions on how to exchange them for your free gifts
4) Enclose a 50 p stamp for part postage along with the Coupon

## The Bonnie Baby 'Club' Corner sponsored by Glaxo

## Eligibility for Membership

If you're expecting a baby in the next three months, or if your new one is not more than two months old, make him a member of The Bonnie Baby 'Club' sponsored by Glaxo. Don't you think that's something a baby would gurgle about?

**FREE!**

**COUPON**

DETAILS MUST BE FILLED IN BALL PEN IN ENGLISH IN BLOCK LETTERS

Yes! I want my baby to join The Bonnie Baby 'Club'! I understand that the membership is free. Please send me the membership card, free gift vouchers and free baby books. I enclose a 50 p stamp for a small part of the postage

Parents name Mr & Mrs ______________________

Address ______________________

Parents signature ______________________

Date baby is expected/was born ______________________

Name of Doctor ______________________

Address ______________________

Name of Hospital (if any) ______________________

Address ______________________

Mrs ______________ is in my care and the above facts are correct to the best of my knowledge

(Signature of Doctor)

Doctor's Regn No

**Glaxo**

E3-ASP

**OUTH** Madras, Coimbatore, Madurai, Tiruchi, irunelveli, Nagercoil, Vellore, Pondicherry, hanjavur, Salem, Bangalore, Mysore, Mangalore, ubli, Belgaum, Shimoga, Hyderabad, Vijayawada, untur, Vishakhapatnam, Rajahmundry, Nellore, urnool, Warangal, Tirupati, Anantapur, Ernakulam, ivandrum, Kottayam, Trichur, Calicut, Quilon, lleppey, Cannanore and Palghat, as well as me cities in **West, North** and **East.**

**pplications will be accepted till ne 30, 1976.**

**ANSWERS TO QUIZ**

1 True The nervous system in new-born babies takes some time to develop and hence, babies are very sensitive

2 False Babies also cry if they have wet themselves, are uncomfortable, etc

3 False Cradle cap is a mild disorder of the scalp

4 False It is caused by deficiency of vitamin C, which is abundantly found in citrus fruits, tomatoes and cabbages

21




అనుకున్నవి అనుకున్నట్లే జరుగుతూపోతుంటే మనిషి మనిషిగా వుండడు. ఏ రేమైనా అయిపోతాడు — లేదా ఆ దేవుణ్ణే మించిపోతాడు! అల్పమానవులకు అంతటి ఉత్కృష్టదశ రాకూడదనే భగవంతుడు వీళ్లకు చీకటి వెలుగుల్లాంటి కష్టసుఖాలను పెట్టాడు.

ఆ ఫలితం పర్యవసానమే మనిషి తలిచింది జరక్కపోవటం, అనూహ్యమైన — మరోటి — ఏదో జరగటం! దాంతో అదృష్టవంతుడైన వ్యక్తి ఉన్నతికి ఎగబ్రాకటం, దురదృష్టవంతుడు అట్టడుక్కు కూరుకుపోవటం — ఇదీ లోకసహజం.

అలాగే తన కుటుంబ విషయంలో రాత్రి పడుకోయేముందు అంత సంతృప్తిని అనుభవించిన సుబ్బరామయ్య, తెల్లవారి లేచి గుండె పగిలే వార్త విన్నాడు. అంతటితో అతడి ఆశలన్నీ పేకమేడల్లా ఒక్కసారిగా కూలిపోయాయి.

''ఇది నిజమా రామనాథం! ఇది నిజమా? లేక...'' హృదయాంతరాల్లో ఎక్కడో చావక మిగిలివున్న పిసరంత ఆశతో అడిగాడు సుబ్బరామయ్య.

రామనాథానిది దుఃఖస్వరమే అయింది.

''నిజమే సుబ్బరాముడూ! నిన్న సాయంత్రం మా ఊరి పొలిమేరల్లో ఈ సంఘటన జరగబట్టి నాకయినా తెలిసింది. విశ్వం ప్రయాణం చేస్తున్న బస్‌ను ఒక లేలాండ్ లారీ గుద్దేసింది. మన దురదృష్టం. విశ్వం ముందు సీటులోనే కూర్చొని ఉన్నాడు... డ్రైవర్ అక్కడికక్కడే చనిపోయాడు... ఇతడుమాత్రం కొనఊపిరితో ఉన్నాడు... తగిలిన గాయాలు పెద్దవి. రక్తం చాలా పోయింది... బ్రతకడని అంటున్నారు. దగ్గర ఉండి నేనే అతణ్ణి హాస్పటల్లో చేర్పించాను. విశ్వం బ్రతకటం అసంభవమే సుబ్బరాముడూ...'' అంటూ అసలు విషయం తప్పదన్నట్లే చెప్పాడు.

అతడు సుబ్బరామయ్య ఇంటికి తెల తెలవారుతూండగా వచ్చాడు. సంగతేమిటో తెలుసుకోవటానికి చిన్న పెద్ద అందరూ అక్కడికి చేరారు. వాళ్ళందరి ముందు దాపరికం లాభం లేదనే జరిగింది పూసగ్రుచ్చినట్లు చెప్పాడు.

ఆ వార్త విన్న అందరి గుండెల్లోను బండ పడ్డట్లయింది. ఎవరి నోటివెంట మాట పెగల్లేదు. సంగతి పూర్తిగా తెలుసుకున్న సుబ్బరామయ్య పెదవులు కొద్ది క్షణాలు వణికాయే తప్పితే పైకి మాట రాలేదు.

అక్కడి అందరి పరిస్థితిని ఆకళింపు చేసుకున్న రామనాథం,

''ఇది విచారిస్తూ కూర్చోవటానికి సమయం కాదు... కర్తవ్యం గురించి ఆలోచించాలి. ఆసుపత్రికి వెళ్దాం బయలుదేరు... ఎంత నిరాశ చేసుకున్నా మన ప్రయత్నాలేమో మనం చేయాలికద?'' అన్నాడు సుబ్బరామయ్యతో.

ఆ మాటలతో రాతిబొమ్మల్లో చలనం వచ్చినట్లు — అందరిలో ఆందోళనకు సంబంధించిన ఆతృత బయలుదేరింది.

కొద్ది నిమిషాలలో ఆ ఇంటికి తాళం పడింది.

*(గత సంచిక తరువాయి)*

ఆ కుటుంబ సభ్యులు ఎక్కిన రిక్షాలు జనరల్ హాస్పిటల్ వైపు దారి తీశాయి.

*　　*　　*

ఎన్నో వింతలు విడ్డూరాలు — మనం నిత్యం వార్తా పత్రికలలో చూస్తునే ఉంటాం. అలాగే కొన్ని కొన్ని యాదృచ్ఛిక సంఘటనలు — జీవితంలో మనం అనుభవపూర్వకంగా రుచి చూస్తూనే ఉంటాం. అలాగే విశ్వం యాక్సిడెంట్‌లో గాయపడ్డ విషయం కావాలని జరిపించింది కాదు. యదార్థంగా జరిగింది ఇది —

ఆ మధ్యాహ్నం సుబ్బరామయ్య అనుమతి తీసుకొని తన ఊరికని బయలుదేరిన విశ్వం సరాసరి బస్ స్టాండ్‌కు వెళ్లలేదు. ముందు కృష్ణ ఇంటికి వెళ్ళాడు, అక్కడివాళ్ళు రామనాథం మాస్టారికి ఏమైనా కబుర్లు చెప్పమంటారేమో కనుక్కుందామని. కానీ, సమయానికి కృష్ణ లేడు. ఆఫీసుకెళ్ళాడు.

***జరిగిన కథ 8:*** సుబ్బరామయ్య సుందరిల సంతానం సుజాత, సుమ, సుధాకర్‌లు. సుజాత అనాకారితనాన్ని ఏవగించుకునే సుమ, మెడిసన్ చదవాలని పట్టుబట్టే సుధాకర్‌ల వల్ల కలత చెందుతాడు సుబ్బరామయ్య. తన అల్లుడికి వుద్యోగం ఇప్పించమని బాల్యమిత్రుడు రామనాథం సుబ్బరామయ్యని కోర్తాడు. సుబ్బరామయ్య చెల్లెలు సీత కొడుకు రమేష్ దుర్వ్యసనాల పాలవుతాడు. రమేష్ వ్యాపారానికి కావలసిన అప్పిప్పించటానికి అంగీకరిస్తాడు సుబ్బరామయ్య. ఆ యింట్లో రామనాథంచే వదలబడ్డ అనాధ విశ్వం, తన మాట నేర్పుతో అందరికీ చేరువ అవుతాడు. అందాలరాశి సుమను వలలో వేసుకోడానికే విశ్వం నాటకమాడుతున్నాడని సుధాకర్‌కు నూరిపోస్తాడు రమేష్. విశ్వాన్ని శంకిస్తారు సుందరి, సుబ్బరామయ్యలు. సుజాతను విశ్వంతో సినిమాకు పంపుతాడు సుబ్బరామయ్య. రమేష్‌తో తిరుగుతున్న సుధ కూడా చెడిపోకుండా చూడమని విశ్వాన్ని కోరుతుంది సీతమ్మ. విశ్వం తన ప్రేమను తిరస్కరించాడన్న కసితో రమేష్‌తో తిరుగుతూంటుంది సుమ. సుజాతనే చేసుకుంటానని విశ్వం రూఢిగా చెప్పగానే రామనాధాన్ని పిలిపించి ముహూర్తం పెట్టిస్తాడు సుబ్బరామయ్య. రమేష్‌వల్ల శీలభంగం కాకుండా తండ్రిచే కాపాడబడిన సుమ, సుజాతను క్షమాపణ కోర్తుంది. విశ్వం పెళ్లి పిలుపుకి తన ఊరు వెళ్లగా రమేష్ పుస్తకాల షాపు తనే తగలబెట్టుకొని ఖైదుచేయబడతాడు.

''కబుర్లేమున్నయ్ అన్నయ్యా, అందరూ క్షేమమేనని చెప్పు. అయినా రేపు నీ పెళ్లికి నాన్న, అమ్మ — అంతా వస్తారుకద?'' అంది నాగలక్ష్మి.

''సరేనమ్మా'' అని కాసేపు ఆ మాట — ఈ మాట మాట్లాడుతూ కూర్చొని తర్వాత బస్ స్టాప్‌కు వెళ్లాడు.

అతడు అక్కడికి చేరుకొనేసరికి దాదాపు మధ్యాహ్నం మూడు గంటలైంది. వాళ్ళ ఊరువైపు వెళ్లే బస్ లైనులో పెట్టి ఉంది. వెళ్లి దానిలో కూర్చున్నాడు.

విశ్వం ఎప్పుడు బస్ ప్రయాణం చేసినా ముందు వరుసలో డ్రైవర్ ప్రక్క ఉండే సింగిల్ సీటులో కూర్చుంటాడు. అక్కడ కూర్చుంటే వచ్చే పోయే ఊళ్ళు, మనుష్యులు, చేలు, చెట్లు — అన్నీ చక్కగా కనిపిస్తాయి. వింతగా తోస్తాయి. అందులో అతడు భావుకుడు — ఏవో కొన్ని కథలు వ్రాసినా అతడు తాను రచయితనంటే ఒప్పుకోడు. ఇతరులు అలా అంటే ఊరుకోడు. అయినా కొంత కాలంగా అతడు ఏమీ వ్రాయ తలపెట్ట లేదుకూడా. తన బ్రతుక్కు స్థిరత్వం ఏర్పడేవరకు అలాంటి ప్రయత్నాలు కూడదనుకున్నాడు ఒకసారి. ఆ మాటకే కట్టుబడి వున్నాడు. అయితే ప్రకృతి సౌందర్యాన్ని ఆస్వాదించటం అతనికి యిష్టం.

అలాగే అప్పుడూ అదే సీటులో కూర్చున్నాడు. అదృష్టంకొద్దీ దొరికింది.

బస్ ముందుకు పోతుంటే విశ్వం మనస్సు వెనక్కు మళ్లింది.

. యాడాది పైచిలుకు అయింది తను స్వగ్రామం వెళ్లి... ఇప్పుడెలా వుందో ఊరు? హైస్కూలు టీచర్లు కొందరు మారిపోయారని చెప్పారు రామనాథం మాష్టారు ఒకసారి. కొత్తగా ఎవరు వచ్చారో... తనను అనేక యిబ్బందులలో ఆదుకున్న చయనులుగారికి — తాను ఊరు వదిలేటప్పుడే అనారోగ్యం — యిపుడు ఎలావున్నారో ఆయన?

'అమ్మ బ్రతికుంటే యీ శుభసమయంలో ఎంత సంతోషించేది! నాన్నే దుర్వ్యసనాలకు లోను కాకుండా — ఆమెను కొట్టి తిట్టకుండావుంటే అలా బలవంతాన బావిలో పడి చనిపోయేదికాదు. నాన్నే ఆ వ్యసనాలకు దాసుడు కాకుండావుంటే తమ యావదాస్తి హారతికర్పూరంలా హరించుకుపోయేది కాదు. చివరకు ఆయనా రోగాలపాలై కృశించి నశించిపోయేవాడుకాదు. ఏదెందుకు జరుగుతుందో? తననుమాత్రం అనాథను చేసి వదిలిపెట్టాడు భగవంతుడు. ఆప్తబంధువులున్నారు కానీ, రక్తసంబంధీకులు ఎవరూ లేరు.' ఈ ఆలోచన వచ్చేసరికి విశ్వం కళ్ళు అప్రయత్నంగా తడిశాయి.

వేగంగా పోతోంది బస్... ఊళ్లు, మనుషులు, గొడ్డు గోద, చెట్టు చేమ — అన్నీ దాటిపోతున్నాయి.

అలా వుండగానే విశ్వానికి దూరంగా మలుపు కనిపించింది. అది 'బ్లైండ్ కర్వ్.' ఒక మలుపు కాదు. రెండు మూడు మలుపులు తిరుగుతుంది రోడ్డు. అక్కడికి తన ఊరికి కొన్ని ఫర్లాంగులే... తనవాళ్లకి దగ్గర వచ్చేశాడు తను. ఒకవిధమైన సంతోషం అతడి హృదయమంతా అల్లుకుపోతోంది.

## సామాన్యుని సణుగుడు

### హీరో వర్షిప్ - 2

అలాగా ! హీరో మీసాలు
పట్టుకు వ్రేలాడే తెనుగు
బైస్కోపులో "థీమ్స్"
ఎందుకు వుంటుంది ?
థీమ్ ఎందుకు వుండాలి ?
మన యువతరం (?)
కోసం తీసే సిన్మాల్లో
హీరో వుంటే పదివేలు
అతని పోజుంటేనే చాలు
కనకవర్షం లారీల
వర్షాన్ని కూడా త్రోసి
నెట్టేసి కురిపిస్తారు
ప్రేక్షక మహాజనులు
అంటారు సినీ పండిట్‌లు !
మన వెండితెరమీద
హీరోయిన్‌లు కేవలం
హీరోల విశాల
వక్షస్థలాల మీద
ఎత్తుగా మెత్తగా తల
ఆన్చే తను వాన్చే
అందాల మణిహారాల పేర్లు !
హీరోల చుట్టూ తిరిగి
తిరిగి హిట్సాంగులకి
లిప్పింగ్ యిచ్చే బొంగరాలు
ఇంకే రంగంలోనైనా
ఉందేమోగాని మహిళా
భ్యుదయం వెండితెరమీదంతా
హీరోదే 'రాజ్యం'
అందుకే బృహత్ చిత్ర
తెనుగు నిర్మాతల కొక
"హీరో" సిన్మా పేర్ల
వరస యివ్వడంకూడా
కళాసేవయేగదా !
అవతరింపుడు అంద
మైన హీరోయిక్ టైటిల్స్
జాబితా ! మగమహారాజు
మీసమున్న మగమహారాజు
మీసం లేకున్నా మొగ
మొనగాడు
దాతలకు దాత, నేతలకు
నేతాజీ ధర్మానికి
దేవుడు దేవుళ్ళకు
దేవుడు .
మొండి, జగమొండి
మన్మధుడు మన్మధులకి
మన్మధుడు భలే
మన్మధుడు భలే భలే
అందాల వీరుడు —
ఇంకా చిత్తగించండి
బంగారుబాబులకు
బాబు, బాబ్బాబు
బాబ్బాబులకు బాబు
జేజి, జేజయ్యలకు
జేజయ్య ఇలా ఇది
బాబుల జేజిల సీరీసు
ఇంక ఆపు నాయ్నా,
బాబ్బాబూ ! అంటూ
గెడ్డాం పుచ్చుక్కు
బ్రతిమాలేదాకా
ఇలాంటి సీరీస్ లెన్నో
మన టీనేజ్ ప్రేక్షక
రాజులు రాణులు
తయారించి యివ్వగల్గు
కనుక జై హీరో
జై జై హీరో అంటూ
కీర్తించు యువతరం
వున్నంతకాలం హీరో
వర్షిప్ వెండితెరమీద
నిల్చునన్నది సామాన్య నిజం [విరజీ]★

---

ఆపకుండా హారన్ కొడుతున్నాడు డ్రైవర్. బస్ ఒక మలుపు తిరిగింది

రెండో మలుపు తిరుగుతూండగా — ఎడమ వైపు నుంచి ఒక 'లేలెండ్' లారీ అతివేగంగా — దాన్ని నడిపే డ్రైవర్ త్రాగాడో—నిద్రపోతున్నాడో, చచ్చాడో — బ్రతికున్నాడో తెలియదు సైడు అదీ ఏమీ లేకుండా అడ్డగోలుగా వచ్చేస్తోంది

విశ్వానికి అంతవరకే తెలుసు ఆ తర్వాత ఒక కార్పొరేషన్ బస్, ఒక ప్రైవేట్ లారీతో ఢీకొన్న ఉదంతం ఆ చుట్టుప్రక్కల వున్న జనానికి మాత్రమే తెలిసింది

* * *

జనరల్ హాస్పిటల్లో స్పెషల్ వార్డులో మూడవ నెంబరు గదిలో బెడ్‌మీద స్పృహలేకుండా పడివున్నాడు విశ్వం అతడికి తిత్తుల ద్వారా ఆక్సిజన్ యిస్తున్నారు నాళికల ద్వారా రక్తం ఎక్కిస్తున్నారు

మిగతా అందరూ లోలోపల బాధపడుతున్నట్లు ముఖం పెట్టారు కానీ ఆ స్థితిలో వున్న అతణ్ణి చూసిన సుజాత పైకే వెక్కి వెక్కి ఏడ్చింది విశ్వం తమ యింటికి తనని గురించే వచ్చాడని తెలిసింది మొదలు అతడే తన భర్తగా ఆమె హృదయంలో ఓ గట్టి ముద్ర పడింది మధ్యలో సుమ ప్రవర్తనవల్ల వెలుగునీడల్లా ఏవో భయ సందేహాలు సుజాతను వెంటాడినా చివరకు చెల్లెలిలో మానసికంగా వచ్చిన మార్పుతో — యిక తనను, విశ్వాన్ని ఎవరూ వేరుచేయలేరని దృఢంగా విశ్వసించింది

అయితే . యిపుడు జరిగిన ఈ దుర్ఘటన తలచుకొంటున్నకొద్దీ దుఃఖం ఆగటంలేదు మనసు చెదరిపోతోంది

"భయపడకమ్మా ! నీది మంచిమనసు మంచి వాళ్లకు దేవుడెప్పుడూ అన్యాయం చేయడు" అంటూ పై వ్యక్తి కనుక రామనాథం కొంత గుండెనిబ్బరంతో ఓదార్చగలిగాడు సుజాతను. కానీ, జరుగుతున్నది తెలుసుకొని, జరగబోయేది ఊహించు కొంటున్న సుబ్బరామయ్య నోటివెంట మాట పెగలటంలేదు

పెద్దదిక్కుగా సీతమ్మ వచ్చి సుజాతను అక్కున చేర్చుకొంది

"అత్తయ్యా!" అంటూ మరోమారు బావురు మంది సుజాత

ఆ తర్వాత సుబ్బరామయ్యలో ఏదో చలనం వచ్చినట్లై, ఆటుగా వచ్చిన డాక్టరును, "అతడి విషయం — ఏమంటారు డాక్టర్ ?" అడిగాడు

"ఇప్పుడే ఏం చెప్పగలం, సార్ ! పేషెంట్ పూర్తిగా కండిషన్ తప్పాడు ప్రస్తుతానికి ఏం చెప్పలేం ! అయినా మా ప్రయత్నలోపం రానీయం" అన్నాడా డాక్టర్

సుబ్బరామయ్య అడిగింది, డాక్టర్ చెప్పిందీ — అందరికీ వినిపించింది

డాక్టర్ మాటలు విన్న సుజాత గుండె మరి బలహీనపడింది సుబ్బరామయ్య — మిగతా అందరి ముఖాలు నల్లగా మారాయి అందులో బెడ్‌మీద వున్న విశ్వాన్ని చూస్తుంటే — అతడు తిరిగి ప్రాణాలతో బయటపడతాడన్న నమ్మకం ఎవరికీ కలగటంలేదు

ఒక గంటసేపటి తర్వాత అందరూ తిరిగి రిక్షాల్లో యింటికి బయలుదేరారు అయితే సుబ్బరామయ్య మరికొద్ది సేపటి తర్వాత రామనాధంతో కలిసివస్తానని హాస్పిటల్ దగ్గరే ఆగిపోయాడు

ఆ రాత్రి ఎనిమిదిగంటల వరకు విశ్వానికి స్పృహవచ్చిన జాడలేదు — ఆ విషయం సుబ్బరామయ్యే చెప్పాడు హాస్పిటల్ నుంచి యింటికి వచ్చాక

### 22

"అన్నయ్యా ! వదినా !"

తెల్లవారి సీతమ్మ గావుకేకలతో ఆ భవంతికి భవంతి దద్దరిల్లిపోయింది

దాంతో యింట్లో అందరూ ఖంగారు ఖంగారుగా హాలులోకి వచ్చారు చూస్తే — సీతమ్మ కళ్లవెంట దారాపాతంగా కన్నీళ్ళు చేతిలో ఒక కాగితం మడత అసలు సంగతి విడమరచి చెప్పలేక ఎచ్చే దుఃఖాన్ని ఆపుకొనే ప్రయత్నంగా చేతివేళ్లు అడ్డంపెట్టుకొని "అన్నయ్యా వదినా" అంది

"ఏమిటి సీతా ! ఏమయింది ?" సుబ్బరామయ్య గుండె వేగంలో మార్పు వచ్చింది చటుక్కున వెళ్లి చెల్లెలి చేతిలోని కాగితం మడత అందుకున్నాడు

"ఏమయిందండీ ? ఏమిటి ఆ ఉత్తరం !" సుందరి ఆత్రంగా భర్త దగ్గరికి వచ్చింది సుమతి కూడా తండ్రి పక్కకి వచ్చింది

సుబ్బరామయ్య చేతులు వణుకుతూండగా ఆ కాగితం మడత విప్పాడు

"దైవస్వరూపులైన అమ్మ, నాన్నలకు — చివరిగా నమస్కరించి వ్రాయునది —

నేను పుట్టుకతోనే ఒక శాపగ్రస్తురాలిని అయినా మీరు నన్ను ప్రాణసమంగా పెంచారు 'కాని పని' అని తెలిసివుండీ నా పెళ్లికి సంకల్పించారు మన అదృష్టంకొద్దీనే విశ్వంగారు నన్ను గురించి యీ యింటికి వచ్చారు వికృతస్వరూపురాలిననీ తెలిసీ నన్ను పెళ్లాడటానికి ఒప్పుకున్నారు ఆయన మానవుడుకాదు దేవుడు అయితే దురదృష్టం పుట్టింది మొదలు నన్ను వెంటాడు తూనే వుంది నేను గిట్టేవరకు అది నన్ను వదలదని రూఢి అయిపోయింది ఈ దౌర్భాగ్యురాలిని ఉద్ధరించాలన్న సత్సంకల్పం ఆయనలో కలగబట్టే ఈ ఘోర ప్రమాదం జరిగి ప్రాణాపాయస్థితి ఏర్పడింది

అయినా పిచ్చి భ్రమ కానీ, అంతటి విషమ స్థితిలో ఉన్న ఆయన బ్రతుకుతాడా ? నిన్న హాస్పిటల్లో ఆ వ్యక్తిని కళ్ళతో చూశాకే నాకా నమ్మకం పోయింది ఇక విశ్వంగారు పోయాక నాకు బ్రతుకేముంది ? అంతటి విశాల హృదయులు

## డాక్టర్ సలహాలు

— డా॥ కె. వెంకటేశ్వరరావు

పి సి — భీమవరం

నాకు చిన్నప్పుడే గొంతు పోయిందట నా వయస్సు 15 సం॥లు నా మాట కీచుగా విని పిస్తుంది నా మాట గట్టిగా రావలెనన్నచో ఏమైనా చికిత్స వున్నదా ?

★ చిన్నప్పుడే గొంతు పోవటం, దాని తర్వాత ఎన్నో సం॥ కాలవ్యవధి ఉండటం, పూర్తిగా గొంతు మామూలువారికి ఉన్నట్లు మారుతుందనే ఆశను దాదాపు వదలుకొమ్మని తెలుపుతూనే ఉన్నా, ప్రయత్నం చేయడంలో తప్పు లేదు పెద్ద నగరాలలో నిపుణులైన ఇ ఎన్ టి వైద్యులచే గొంతు పరీక్ష చేయించుకొని ఒకరికి యిద్దరి అభిప్రాయాలను కనుగొన్న తర్వాత — ఆశ వదులుకోవటంగాని చికిత్స లేదని భ్రమపడి నిరుత్సాహ పడటంగాని తప్పనే నా అభిప్రాయం ఏదైనా ముందు అడుగుపెట్టి చూడాలిగా !

కె ఎస్ ఆర్. — హిందూపూర్

నా వయస్సు 17 సం॥లు తల వెంట్రుకలు పొడుగ్గా పెరుగునని కొన్ని ప్రకటనలు చూచి కొన్ని మందులు వాడినాను 2, 3 నెలలు వాడిన తర్వాత వెంట్రుకలు పెరుగుటకు బదులు వూడిపోతున్నాయి ఇలా ఎందుకు జరిగింది ?

★ పత్రికా ప్రకటనలు — వ్యాపారదృష్ట్యా చేయబడతాయని తెలియని అమాయకులు మన దేశంలో నూటికి 90 మంది వున్నారు గనుకనే, ఇన్ని మందుల తయారీ సంస్థలు, ఏజన్సీలు మన దేశంలో పెరిగిపోయాయి ఏదైనా, దానిని గురించి పూర్తి వివరాలు చదివి, స్వయానా యితరులు లాభం పొందగ చూసి తృప్తిచెందిన తర్వాత తాము కూడా వాడటం — సజ్జనుల లక్షణాలని—సుభాషితం. ఇదే మాట "డాక్టర్ సలహాలకి" — డైలీ పేపర్ (సోమవారం) లోని డాక్టర్ కబుర్లకీ వర్తిస్తుందిగా!

---

మళ్లీ మనకు మరొకరు తటస్థపడటమూ, ఈ కురూపిని ఉద్ధరించటానికి పూనుకోవటమూ — ఇది జరిగే మాట శుద్ధ అబద్ధం నా జీవితం ఇలా లద్దంతరంగా అంతమైపోవాల్సిందే. అది ఆ భగ వంతుడు నా ముఖాన రాసే ఈ భూమ్మీదికి పంపాడు.

ఇలా మోడులా జీవితాంతం బ్రతకలేనని నిర్ధారణకు వచ్చాకే నేను ఆత్మార్పణం కావించుకోవా లన్న నిర్ణయానికి వచ్చాను నా బలవన్మరణానికి అమ్మ నిద్రమాత్రలు నాకు బాగా ఉపకరిస్తున్నయ్ సీసాలో ఉన్నవి మొత్తం మింగేస్తున్నాను.

మరో జన్మకైనా మీరే నా తల్లిదండ్రులు కావాలనీ, విశ్వంగారు నా భర్త కావాలనీ — మీ అందరి ఆప్యాయానురాగాల మధ్య కలకాలం సౌభాగ్యవతిగా వర్ధిల్లుతూ బ్రతకాలనీ ఆకాంక్షిస్తూ—

మీ కూతురు,
సుజాత "

చేతిలో ఉన్న ఉత్తరాన్ని అక్కడే పడేసి గదిలోకి వెళ్లి, మంచంమీద నిద్రపోతున్నట్లు వత్తిగిలి పదు కున్న సుజాతలో — ఏమైనా ఇంకా కొన ఊపిరి ఉందేమోనన్న ఆశతో చూశాడు సుబ్బరామయ్య

కానీ, అప్పటికే ఆమె వళ్ళు చల్లబడ్డది కాళ్ళు చేతులు బిగుసుకుపోయాయి

సుజాత అనబడే పెద్ద కూతురు తమకిక లేదు— అన్న సంగతి గుర్తు వచ్చిన సుబ్బరామయ్య అక్కడే కుప్పలా కూలబడిపోయాడు సుందరి మాత్రం సుజాత కట్టెమీద పడి శోకాలు పెట్టసాగింది ఆమెది కడుపుకోతమరి

ఏడుపులు పెడబొబ్బలతో ఆ ఇల్లు హోరెత్తి పోతోంది విషయ మేమిటో తెలుసుకుందామని ఇరుగు పొరుగు జనం వాకిట్లో పోగవుతున్నారు

ఆ సమయంలోనే, "సుబ్బరావుడూ ! ఒరేయ్ సుబ్బరాముడూ !" — గేటు దగ్గర్నుంచీనే అనుకొంటూ వస్తున్న రామనాథం, వరండాలో మనుషులు, లోపలినుంచి శోకాలు వినిపించటంతో మ్రాన్పడిపోయాడు అప్పటివరకు అతడిలో ఉన్న సంతోషమంతా హరించుకుపోయింది

తర్వాత ఏం జరిగిందో తెలుసుకోవాలన్న ఆరాటంతో దాదాపు పరుగెత్తుతున్నట్లే నడిచి లోపలికి వచ్చాడు తీరా అక్కడి దృశ్యం చూశాక

## కాలమిచ్చిన తీర్పు

దాదాపు కొయ్యబారినట్లే అయిపోయాడు

కొద్దిసేపటి తర్వాత, "ఎంత పని జరిగి పోయింది సుబ్బరావుడూ !" అంటూ సుబ్బరామయ్య మీద చేయి వేసి ప్రక్కనే కూర్చున్నాడు రామనాథం కన్నీళ్ళతో మిత్రుడి వళ్ళో తల పెట్టుకొని పసి పిల్లవాడికంటే హీనంగా విలపించాడు సుబ్బ రామయ్య

"ఎవరం ఎంత దుఃఖపడితే మాత్రం ?. అయిపోయింది సుబ్బరావుడూ . పోయిన సుజాత తిరిగి రాదు... మగవాడివి నువ్వయినా కొంచెం గుండె దిటవు చేసుకో " అంటూ తనకు తోచిన విధంగా మిత్రుణ్ని ఓదార్చాడు రామనాథం

అతడంత చెప్పినా కొంతసేపటివరకు అలాగే ఏడుస్తూండిపోయాడు సుబ్బరామయ్య

"ఈ దురదృష్టకరపు సంఘటన జరిగి ఉండకపోతే — ఇప్పుడిది మనకెంతో సంతోష సమయ మయ్యేది" అన్నాడు చివరకు మిత్రుణ్ని లేవదీసిన రామనాథం

అంత దుఃఖంలో వుండీ ఉడిగాడు సుబ్బ రామయ్య

"ఏమైంది ? విశ్వం ... బ్రతికాడా ?"

"అవును తెల్లవారుఝామునే స్పృహవచ్చింది కొంచెం కొంచెం మాట్లాడుతున్నాడు అతడు బ్రతికి బయటపడ్డట్లేనని అంటున్నారు డాక్టర్లు "

"అలాగా !" పైకి అలా అన్నా — సుజాత చనిపోవటం, విశ్వం బ్రతకటం మాట తలుచుకొనే కొద్దీ దుఃఖం మరీ ఎక్కువైంది సుబ్బరామయ్యకు ఈ సంగతి విన్న మిగతా అందరూకూడా జరిగి పోయిందాన్ని తలుచుకొని తలుచుకొని ఏడుస్తున్నారు

రామనాథానికి ఇంకేం చేయాలో, మాట్లా డాలో తోచక — ఆ శవం దగ్గర ఎక్కువసేపు వుండలేక సుబ్బరామయ్యనుకూడా తీసుకొని ఇవతలకు వచ్చాడు ఆనాటి అక్కడ మిగతా పనులన్నీ నిర్వర్తించవలసింది మూడో వ్యక్తిగా అతడే మరి

* * *

రెండు నెలల తర్వాత మాట —

కళ్యాణమంటపం తోరణాలతో, విద్యుద్దీపా లంకరణతో, సుఖాసీనులైన ఆహూతులతో కళకళ లాడిపోతోంది

వివాహవేదిక మీద సుమ, విశ్వం — వాళ్లిద్దర్నీ కలిపి చూస్తున్న సుబ్బరామయ్యకు కన్నులపండువు లానే వున్నా, హృదయాంతరాల్లో ఏదో వెలితి — అతడి సంతోషానికి కత్తెరవేస్తోంది

"పోయినవాళ్లను గురించి మనమూ పోతామా ? నీ ఆర్థిక పరిస్థితి గుర్తుతెచ్చుకొని జరగవలసింది ఆలోచించుకో " అంటూ విశ్వానికి సుమ నిచ్చి చేయవలసిందని సలహాయిచ్చి — వత్తిడి పెట్టాడు తనని, రామనాథం.

"వాళ్లిద్దరి యిష్టం ఆ ఏర్పాట్లుకూడా నువ్వే చూడు " అని తను ఊరుకున్నాడు

అలా యీ విషయంలో రామనాథమే పూను కున్నాడు

"తాము వివాహం చేసుకొంటే చనిపోయిన సుజాత మనస్సుకు శాంతి వుండదని" సుమ, విశ్వం ఇద్దరూ ముందు సంశయించారు కానీ, రామనాథం తన పట్టు వదలలేదు

"మీరిద్దరూ ఒకటైతేనే సుజాత ఆత్మ సంతోషపడుతుంది. అయినా మనమిదంతా కావాలని చేస్తున్నామా? భగవంతుడే కావాలని జరిపించినట్లు జరిగింది పెళ్లికి ముహూర్తం పెట్టుకోవటం, విశ్వం యాక్సిడెంట్‌లో చిక్కుకోవటం, అతడు బ్రతకడని సుజాత ఆత్మహత్య చేసుకోవటం — యిదంతా ఎలా జరిగింది ? విధివశాన ! దీని అంతరార్థం మీరిద్దరూ భార్యాభర్తలు కావటమే " అంటూ చాలా చాలా చెప్పి వాళ్లిద్దరూ అందుకు ఒప్పుకొనేట్లు చేశాడు

వివాహం యథావిధిగానే జరిగింది.

తన పాదాలమీద పడ్డ నవదంపతులను మనసారా దీవించటానికి తటపటాయిస్తున్న సుబ్బ రామయ్యతో ప్రక్కనేవున్న రామనాథం అన్నాడు,

"మనం మనుషులం సుబ్బరావుడూ ! అనుకున్నదానికికాదు — కాలమిచ్చే తీర్పుకు కట్టుబడి వుండాలి మనం ఇది ఎటువంటివాళ్లకూ తప్పదు " అని

నిష్కల్మష హృదయుడైన విశ్వాన్ని చూస్తున్న సుబ్బరామయ్యకూ చివరకు అంతే అనిపించి, "మీరిద్దరూ కలకాలం సుఖసంతోషాలతో జీవించండి" అని వాళ్లిద్దర్నీ హృదయపూర్వకంగా ఆశీర్వదించాడు అతనికిప్పుడు ఏదీ సమస్యగా తోచటంలేదు, రమేష్‌కు జైలుశిక్ష పడి — సీతమ్మ బ్యాంకువాళ్లకు డబ్బు కట్టెయ్యటంతో

( అయిపోయింది )

ఎ. ఎన్. కె. విజయవాడ

నాకు 14 సం. లు నా చిన్నప్పుడు రెండవ సంవత్సరములో కాలికి పోలియో వచ్చినది. నాకు కుడి కాలు మీద చెయ్యివేసుకునినడుచుటఅలవాటు చేసుకొన్నాను. క్రమేపి నాకు ఎడమవైపువ గూని వచ్చినది. నా కాలు రాకపోయినను, గూని పోవుటకు మార్గము తెల్పండి.

ఇలా ప్రత్యేకంగా, ఒక రోగం వల్ల దానిని సరిపుచ్చుకోవటానికో మేలు కలుగజేసుకోవటానికో కొన్ని మార్గాలు అవలంబించినప్పుడు మీకు కలిగినట్లే ఇతరులకూ రాగల అవకాశం ఉన్నది.

మీరు మీ "గూని"కి కొన్ని వ్యాయామ చికిత్సలు పొందటం చాలా మేలు కలుగ చేస్తుంది. వేరే ఇతర మార్గాలేవి లేవు.

(18వ పేజీ తరువాయి)

అలవాటు చేసుకుంటుంది సర్దుకు పోగలుగుతుంది కాని అత్తగారి సాధింపు నెలా భరించగలదు? ఇదీ ఆమె ఆవేదన

* * *

మిట్టమధ్యాహ్నానికల్లా పొలం పని కొంత పూర్తిచేసి భోజనానికింటికొచ్చాడు సాంబమూర్తి విశాలవైపు ఓరగా చూసి నవ్వాడు. జీవంలేని నవ్వొకటి తనూ నవ్వింది విశాల.

భర్తకు తను భోజనం వడ్డించబోతుంటే వారించిందినరసమ్మ. గుడ్లురిమిచూసి "పోనీ దాన్నే పెట్టనీయ్యమ్మా!" అన్నాడు మెల్లగా సాంబమూర్తి.

"నీకేమన్నా మతి పోయిందా ఏమిట్రా! కొత్త కోడలు నప్పుడే కష్టపెట్టమంటావుట్రా! ఆ పని ఈ పని చెప్పి" కొడుకును ఒక్క గదమాయింపు గదమాయించింది. దాంతో సాంబమూర్తి కిక్కురుమంటేఒట్టు!

అత్త గయ్యాళిగాదు గుండెలు తీసిన బంటు అని గూడా అర్థంచేసుకుంది విశాల. వెంటనే మళ్లీ పొలమెళ్ళిన సాంబమూర్తి రాత్రి పొద్దింటికిగాని తిరిగి రాలేదు

ఆ రాత్రి సాంబమూర్తి కౌగిలిలో పరవశించేటప్పుడు మాత్రం ఆరోజల్లా అత్త పెట్టిన ఆరళ్లు మరచిపోగలిగింది విశాల

"ఎలా వుంది విశాలా నీకిక్కడ బాగుందా? అన్ని విధాలా సౌఖ్యంగా వుందా?" అని సాంబమూర్తి లాలనగా అడిగినప్పుడు నిజం చెప్పేద్దామా...తన మనసులో ఉన్న బాధంతా కక్కేద్దామా! అనిపించింది విశాలకు కాని వచ్చిన తొలి రోజుల్లోనే అత్తమీద చాడీలు చెప్పినట్లు వస్తుందేమో! దాని ఫలితాలెలా ఉంటయ్యోనని భయపడి మిన్నకుంది.

# కను విప్పు

సాంబమూర్తి గూడా ఏదో కొత్త పెళ్లాం మోజులో అన్నాడేగానీ.. నోరు పెట్టుకుని అమ్మతల్లిలా పడే తన తల్లిని ఎదిరించలేడని తనకూ తెల్సు కాని విరిసిన పువ్వులావున్న భార్య అందాల్ని ఆస్వాదిస్తున్నప్పుడు మాత్రం ఆమె కోసం ఏమైనా చెయ్యాలనిపిస్తోంది సాంబమూర్తికి అందుకనే విశాల......తన మనసు నోరు మూసి. . "మీరుండగా నాకేం లోటు? అన్నీ దివ్యంగా ఉన్నాయి!" అన్నప్పుడు ఆమెను ముద్దులతో కౌగిలింతలతో ఉక్కిరిబిక్కిరి చేస్తాడు

* * *

మరుసటి రోజు విశాలకు తిప్పలు మళ్లీ ప్రారంభమయాయి దొడ్లో పాడిగేదెఒక్కటే ఉంది దానిని తోలుకెళ్లి మేపి తోలుకురావటానికి కనీసం ఓ కుర్రాణ్ణి గూడా పెట్టలేదు నరసమ్మ ఇంటివెనకాల పచ్చికబయలుంది కొంతమేరకు ..నాథుడులేని రాజ్యంలా అక్కడికి తోలుతుంది గేదెని...పాలుపితకటం అయిన తర్వాత అదికూడా నరసమ్మకు భయపడుతుందోఏమో! మళ్లీ సాయంత్రం నాలుగు నాలుగున్నరయ్యేసరికి పచ్చిక మేసి దొడ్లోకి వచ్చేస్తుంది మధ్యమధ్యలో మాత్రం నరసమ్మ ఓ రెండడుగులు వేసి ఉన్నావా గేదెమ్మా!! అన్నట్లుగా, ఆఁయ్! ఆఁయ్! అంటూ దూడరచినట్లుగా అరుస్తుంది. చిత్రం! టెలిఫోను పిలుపందుకున్నట్లుగా నేనిక్కడే వున్నానన్నట్లుగా అది దాని భాషలో జవాబు చెబుతుంది ఆ సమయంలో నరసమ్మ ఒక ప్రదక్షిణం చేసినట్లుగా వెళ్లి ఓ తట్టలో పేడకళ్లన్నీ పోగుచేసుకుని వస్తుంది

ఇప్పుడు విశాలకు మరో కొత్త అనుభవం నేర్పబోతోంది నరసమ్మ పాచీ అంట్లు పూర్తయేసరికి మామూలు ప్రకారం రెండు గుక్కలు కాఫీ ఇచ్చి.

"ఏమేవ్! ఇట్రా" అంది అథార్టీగా విశాల రాగానే పేడకుప్ప చూపించి "ఇదిగో దీన్నితొక్కు కాళ్లతో! కచ్చాపచ్చాగా! పిడకలు చెయ్యాలి!"అంది ఊక ముందేసుక్కూర్చుని

పేడ తొక్కటం మెప్పుడూలేని విశాలకు వాంతి వచ్చినట్లయింది పని మనుషులు పాలేళ్లు చేయవలసిన పనులివి వాళ్లేమయినట్టు? ఎవరూ కనిపించరేం అనుకొందివిశాల

అయినా అత్త గదమాయింపులకు భయపడి, అంతులేని అసహ్యంతోనే ఆపని చేసింది కాళ్లు కడుక్కునేటప్పుడు విశాల మనోభావాలు జుగుప్సకి ఆలవాలం గోడచాటుకు వెళ్లి కళ్లనీళ్లు గుక్కుకుంది విశాల

కాని కొన్ని రోజులు పోయేసరికి జీవితంతో రాజీకొచ్చేసింది విశాల.

వంటపని ఇంటిపని మొత్తం అలవాటు చేసుకుంది. ఇప్పుడామెకు అత్త ఏ పని చెప్పినా అసహ్యము అసహనమూ ఏమీ లేవు విషాదంలోనూ ఆనందాన్ని వెతుక్కునే మనస్తత్వాన్ని అలవాటు చేసుకొంది గంగిరెద్దులా పని చెయ్యటానికే నిశ్చయించుకుంది అలా చేస్తే .. అత్త ఏమీ అనకుండా ఉంటుందని తద్వారా మనశ్శాంతి లభిస్తుందని ఆమె భావన

* * *

విశాల ముఖంలో మొదటలో కనిపించిన కలలూ కోర్కెలస్సానే ఇప్పుడదొరకం నిర్లిప్తత కనుపించటం సాంబమూర్తి గమనించకపోలేదు. "ఏమిటి విశాలా? అలా వున్నావని ఎన్నిసార్లు తరచి అడిగినా చోటివ్వలేదు విశాల. గృహచ్ఛిద్రాలకు తానుగా కారణమవటం ఆమెకు సుతారమూ ఇష్టంలేదు. అందుకని సుతారంగా నవ్వుతూ "ఏంలేదు! నాకేం! నేను బాగానే ఉన్నానే!" అంటూ కప్పదాటు వేసింది 'గావున్ను' అనుకుని భార్య శరీరాన్ని తమకంతో నలిపివేసేవాడు సాంబమూర్తి. నిజానిజాలతనికేం తెల్సు?

ఓరోజు అమ్మాయిని చూసి వెళదామని విశాల తల్లి దండ్రులొచ్చారు తల్లి వళ్ళో వాలి బావురుమని ఏడవాలని...నాన్నతో చెప్పి అత్తను కసిదీరా తన్నించాలని అనిపించింది విశాలకు కాని దానివల్ల ఎవరికి నష్టం? తనకేగదూ! తన బతుకింతకన్నా అధ్వాన్నమవదూ!? అన్న ఆలోచన ఆమెనలాటిపని చేయకుండా వారించింది

నరసమ్మ వియ్యపురాల్ని, వియంకుణ్ణి ఎంతో మర్యాద చేసింది ఆమె ఆతిథ్యానికి ముగ్ధులైన విశాల తల్లి దండ్రులు తమ కూతురు బోలెడు సుఖపడి పోతోందనే భావించారు.

"కాస్త చిక్కినట్లున్నావే విశాలా" అన్న ప్రశ్నకు జవాబు తననివ్వలేదు నరసమ్మ.

"ఊరు మార్పిడి గదమ్మా వదినా! నీటి మార్పిడి గూడాను! అందుకని ఏదో అలా

ఉంది ఈ నీళ్లపడి ఓ నెల లోజులు పోనీ ఇంకా వళ్లుచేసి నవ నవలాడిపోతుందనుకో!'' అంటూ సర్దేసింది

''ప్రస్తుతం దగ్గిర్లో పండగలేమీ లేవు గదా! అమ్మాయినో నాల్గు రోజులు పంపుతారా? ఉంచుకుని పంపుతాం!'' అంటే చాకచక్యంగా కాదనేసింది నరసమ్మ.

''అప్పుడే తీసుకెడతానంటే ఎలాగమ్మా! పనీపాటలు బాగా చేసు ండగాను. అదీగాక వాడికిప్పుడు రావటానికి పొలంపనుల్లో తీరుబాటులేదు ఇదిలేకుండా వాడు క్షణంసేపుండడు ఏదో అనుకున్నానుగానీ వదినా! మీ అమ్మాయి మొత్తానికి మా అబ్బాయిని కొంగున ముడేసుకుందనుకో!''

ఆ మాటలకు తృప్తిపడి విశాల తల్లిదండ్రులిరువురూ వెళ్లిపోయారు ''అత్తగారు చెప్పినట్లు తూచ తప్పకుండా నడుచుకో'' అని చెప్పి.

*     *     *

కోడలు పనిపాటలన్నీ క్షుణ్ణంగా నేర్చుకుని ఓర్పుతో చేసుకుపోవటంలో నరసమ్మ ఇరకాటంలోపడింది గబుక్కున ఏ మాట జారదామన్నా వీలులేకుండా ఉందామెకు. కానీ తిరిగే కాలూ తిట్టే నోరూ ఊరుకోవటమా! నరసమ్మ రెండోరకానికి చెందినది అసలు నరసమ్మ

## కనువిప్పు

బతుకంతా ఒకరిని తిట్టటంలోనే గడిచిపోయింది యుక్తవయస్సు వచ్చిందగ్గర్నుంచీ. మొగుడు బతికున్న రోజుల్లో ఆయన్ను తెగ తిట్టిపోసి ''గంప రాకాసి'' అన్న బిరుదును సంపాయించింది ఆయన ''హరీ'మన్న తర్వాత పాలేళ్లను తిట్టటం మొదలు పెట్టింది ఈమె ధాటికి పడలేక పాలేళ్లు ఇంటికి మాత్రం రామని మొలాయించారు కాని పాలేళ్లు లేకపోతే పొలం పనులన్నీ మొండిన బడతాయి అందుకని సాంబమూర్తి తల్లి మనసు నొప్పించకుండా పాలేళ్లను పోగొట్టుకోకుండా... ఇంటికి దగ్గరలో వేరే పాక వేయించాడు. పాలేళ్లంతా అక్కడికే వచ్చి... ఎడ్లను తోలుకెళ్లటం. బండి కట్టుకోటం లాంటి పనులు చేస్తుంటారు. సాధారణంగా పాలేళ్లకు యజమాని ఇంటిదగ్గర అన్నం పెట్టటం రివాజు. అన్నం పెట్టి సంవత్సరానికిన్ని బస్తాలివ్వటం అని ఉంటుంది షరతు గయ్యాళి నరసమ్మ ఇంట్లో భోజనంచేసే పరిస్థితి లేదుగనక ... ఆ మేరకుకూడా వడ్లే ఇమ్మన్నారు పాలేళ్లు అలాగేనని ఒప్పుకున్నాడు సాంబమూర్తి.

పాలేళ్లు చెయ్యి జారిపోయిన తర్వాత నరసమ్మ నోరు పనిమనుషులు. బట్టలుతికే మడేళ్ళవైపు తిరిగింది. ఏదో వంకతో నోరు అరిగిపోయేవరకూడా వాళ్లను తిట్టసాగింది. భరించి.. భరించి ఓర్పు నశించి.. ఒక్కసారిగా కట్టకట్టుకుని ఎదురు తిరిగారు వాళ్లంతా'' ''పోపోవమ్మా! ఎనకటికెవతో నీలాంటిది... నా కోడి.. నా కుంపటి ... లేకపోతే తెల్లారుద్దా? అందంట! అట్టా ఉంది నీ యవ్వారం! నీ యిల్లు కాకపోతే ఈ వూల్లో శానాయిల్లుండాయి'' అంటూ ఛీ! కొట్టి ఎగ్గొట్టిపోయారు వాళ్లు. వాళ్ల మీద పంతంకొద్దీ ఆ పనులన్నీ నెత్తిమీద వేసుకుని చెయ్యడం దుక్కలా ఉన్న నరస్సమ్మకు బాధ అనిపించలేదు గానీ, నోరుకు బొత్తిగా పని లేకపోవటమే ప్రాణసంకటంగా ఉందామెకు కొడుకు తనకు పూర్తిగా విధేయుడు! మాట జవదాటడు! పైగా రక్తసంబంధం! అందుకని కొడుకును మాత్రమేం సాధించదు నరసమ్మ ఇలా నరసమ్మ ప్రాణం తిట్ల దాహంతో తపించిపోతున్న సమయంలో విశాల కోడలుగా అడుగు పెట్టటం పండగలా అనిపించింది నరసమ్మకు సంతోషంతో ఎగిరి గంతేసినట్లయిందామెకు! అత్త కోడలును బాధించటం. సాధించటం రాచి రంపాన పెట్టటం. జన్మహక్కని నరసమ్మ ఉద్దేశ్యం! తన అత్త తను కాపరానికొచ్చిన మొదటి రోజుల్లోనే బాల్చీ తన్నేయబట్టిగానీ ... లేకపోతే తనను మాత్రం చంపుకుతిని ఉండేదిగదూ? పైగా అత్త తిట్టటం–కొట్టటం–కోడలు పడటం అనేవి లేకపోతే కోడళ్లు అత్త నెత్తికెక్కి పిండి కొట్టటం ఖాయం! అందుకని కోడళ్లు నెప్పుడూ అత్త చెప్పుకింద తేలులా ఉంచాలి! ఇదీ నరసమ్మ పిడివాదం!

ఈ సూత్రాన్నాధారం చేసుకునే ఇంత వరకూ కోడలును సాధించింది పని సరిగ్గా రాదుగదా! పడకేం చేస్తుంది? అని నరసమ్మ మనోభిప్రాయం, కాని ఇప్పుడు కోడలు పనులన్నీ కూలంకషంగా నేర్చుకుని లోటు లేకుండా చేస్తూ ఓ మెట్టు పైనుంది. ఇప్పుడెలా దాన్ని తప్పు పట్టటం? బుర్ర బద్దలు కొట్టుకుని కొట్టుకుని. ఓ మెరుపు లాంటి ఆలోచనరాగా ... తృప్తిగా నవ్వుకుంది నరసమ్మ.

( ఇంకా ఉంది )



జి. కామరాజు సమర్పించు శ్రీ లక్ష్మీనారాయణ ఎంటర్‌ప్రైజెస్ వారి

తప్పక చూడండి

# నాపేరే భగవాన్

దర్శకత్వం: యస్.డి.లాల్

ఈస్ట్‌మన్ కలర్

నిర్మాతలు: కుదరవల్లి సీతారామస్వామి - గుమ్మళ్ళ లక్ష్మణరావు



# ప్రశ్నావళి

**కె. రామలక్ష్మి**

**జి. వి. ఆర్. — బ్రాహ్మణగూడెం**

స్త్రీ ఉద్యోగం చేయవచ్చువాళ్ళవిల వచ్చు. కాని స్త్రీల విషయంలో అన్వయించనివి అనేకం అందువలన సమానత్వం కావాలనుకోడంలో అర్థంలేదు.

చిత్తం తమవంటి పెద్దలమాట పెడచెవిని పెట్టడం బాగుండదు గాని ఆ అనేకంలోఒకటో అరో చెప్పలేదేం ?

**ఎం. ఆర్. — బెల్లంపల్లి**

నవ్విందంటే అధరంవరకే
నడిచిందంటే గుమ్మంవరకే
చెప్పిందంటే భర్త చెవివరకే
కోపం వచ్చిదంటే కొద్దిపాటి మవునంవరకే
ఇలాంటి స్త్రీని ఏమనాలి ?
నంగనాచి !

**ఎ. పి. బి. — కొత్తకోట**

మగవాడు స్త్రీని సాటి మనిషిగా ఎందుకు గౌరవించడు ? తనలో ఏదో ఆధిక్యత ఆమెలో లేనిది ఉంది అని ఎందుకు అనుకుంటాడు ?

చిన్నతనమైనా అయివుండాలి. అహంకారమేనా అయివుండాలి ! ఒక్కక్షణంపాటు ఆలోచించుకుంటే ఏమనిషి ఏమనిషికీ తీసికట్టుకాదన్న చిన్న సత్యం గ్రహించలేడ మగవాడు ?

**బి. వి. ఆర్. — ఆస్త్రాబల్లి**

మీకు ఒకలాటరీ టిక్కెట్టు తగిలితే గుండె ఆగిచస్తారా ? లేక సంతోషం కొద్దీ జవాబు లివ్వడం మానివేస్తారా ?

ఒచ్చిందని తెలిస్తే ఒచ్చేవాళ్ళన్నారు. నేను చావక్కర్లేదు ! ఇక, మబ్బులో నీళ్ళచూసి ముంతలో నీళ్ళ పారపోసుకునేంత పిచ్చిదాన్ని కాదు జవాబులివ్వడం మానను.

**ఎమ్. వి. ఎస్. — హైదాబాదు**

ప్రతి మనిషి, తాను మంచి వాడవాలనిఅనుకున్నా సమాజం అతడిని చెడ్డవాడిగా భావిస్తుంది ?

సమాజమా ? సాటి మనుషులా ?!

**కె. జె. కె. — కర్నూలు**

ప్రతీదీ మారుతోంది యీ లోకంలో ప్రశ్నావళిలో మీరు తప్ప. ఎందుకని ?

మారని విలువలు కొన్ని వుంటూవుంటాయి. అందుకని !

**ఆర్. ఎల్. కె. — పామర్రు**

భగవంతుడు ప్రజలచేత దేవుడని ఎలా అనిపించుకో కల్గుతున్నాడు ?

వారి వారి కోర్కెలు తీర్చి !

**పి. ఎస్. — కదిరి**

నాడు కన్యాశుల్కం. నేడు వరకట్నం మరి రే ?

అమ్మాయికి అబ్బాయి, అబ్బాయికి అమ్మాయి కట్నం కావాలని... ఆశ.

**పి.ఎమ్.హెచ్. — విశాఖపట్నం**

మీ సమాధానాలు చదువుతుంటే ఆడవాళ్ళమీద నాకున్న మంచి అభిప్రాయం కోల్పోతున్నాను దీనికి మీరేమంటారు ?

గాలి కోడిలా కదిలే బలహీనమైన మీఅభిప్రాయం ఎలాంటిదో మీకే తెలియడంలేదా ?! అలాంటి అభిప్రాయం ఆడవారి మీదఉన్నా, లేకున్నా ఒకటే.

**బి. ఎస్. ఆర్. — విజయనగరం**

ఇది అంతర్జాతీయ మహిళా సంవత్సరం అని గర్వించకండి.

అది గర్వకారణం అయితే కద! జీర్ణదేవాలయోద్ధరణ, వింత జంతువులు నాశనం అయిపోకుండా రక్షించడానికై ప్రత్యేకింపబడిన ఉత్స

# డిపీస్ నుండి మరొక వినియోగదారుని- లాభదాయక పథకం

# రూ.1·10లు తగ్గింపు

# డిపీస్ జెల్లీ క్రిస్టల్స్‌పై

మీ విక్రేతల వద్ద అనువైన డిపీస్ సదావకాశాన్ని గమనించండి. డిపీస్ యొక్క స్క్వాష్/సిరప్/క్రష్/ కార్డియల్ ప్రతి సీసా ఒక కూపన్ కలిగియుంటుంది. అది మీరు కొనే ప్రతి ప్యాకెట్ డిపీస్ జెల్లీ క్రిస్టల్స్ యొక్క ముద్రించబడ్డ ధరపై రూ. 1.10లు తక్కువ కల్గియుంటుంది. కాబట్టి ఒక సీసా కొనండి. అందులో వున్న కూపన్ వేరుచేసి, అది మీ విక్రేతకిచ్చి ఆరు రకాల పండ్ల సువాసనగల డిపీస్ జెల్లీ క్రిస్టల్స్‌లో దేనికైనా తీసుకోండి.

చెర్రీ, ఆరెంజ్, రాస్ప్‌బెర్రీ, లెమన్, స్ట్రాబెర్రీ మరియు పైన్‌ఏపిల్.

**నేడే కొనండి...లాభాన్ని పొందండి.**

**ఈ ఆకర్షణీయమైన సదుపాయం కేవలం 30.6.1976వ తా॥ వరకే.**

కేరళ రాష్ట్రము మినహా, భారతదేశమంతా ఈ సదుపాయం గలదు.




Dipy's Coupon

RS. 1.10 OFF

on Dipy's Jelly Crystals

VALID TILL JUNE 30, 1976

Dipy's

ORANGE SQUASH

Dipy's

RASPBERRY JELLY CRYSTALS

MADE IN INDIA BY

HERBERTSONS LIMITED

Homi Mody Street, Bombay 400 001

Interpub/HL/1/76 tel

వాలు, మన సాంస్కృతిక సంవత్సరం ఉపాధ్యాయుల, పిల్లల, స్వాతంత్ర్య దిన వార్షికాలు ఇవన్నీ గర్వకారణంగా వుంటే, యీ ప్రత్యేక మహిళా సంవత్సరం గర్వకారణం అయ్యేది. తరతరాల వెనుకబడినతనాన్ని, అణచివేసిన పరిస్థితిని, అధమాధమంగా చూడబడుతున్న గతిని

## ప్రశ్నావళి

గుర్తుచేసి ప్రపంచ దృష్టినాకర్షించ చేయడానికై ప్రత్యేకించిన యీ సంవత్సరం గర్వకారణంఅనుకోడం లేదు.

కె. ఎస్. — వల్లంపూడి

ఇది మహిళా సంవత్సరం మిగిలిన సంవత్సరాలన్నీ పురుషులవి కనుక ఆధిక్యతలో వున్నపురుషులకు విలువ నిస్తారని ఆశిస్తా.

ఆ ఆధిక్యతాభావం తోసి రాజంటేనేగాని మీరూ అధికులుకారు.

# హైదరాబాద్ నోట్‌బుక్ — తిరుమల రామచంద్ర

## మేయర్లకు ముఖ్యమంత్రి సూచన

పట్టణాలు జీవికకు పట్టుగొమ్మలు కనుక, గ్రామ ప్రాంతాలనుంచి జనం కడుపుచేతబట్టుకొని రాకతప్పదు. వారి రాకతో, పట్టణాలలో సమ్మర్దం, తత్ఫలితంగా మురికివాడల పుట్టుక తప్పవు. ముఖ్యమంత్రి అన్నట్టు పట్టణాల జనాభా రెంతింతలవుతున్నాయి. కనుక, ఆయనే అన్నట్టు నగరాలలో అధిక సంఖ్యాకులు మురికివాడల్లో నివసిస్తున్నందున నగరాలను, పట్టణాలను సక్రమ రీతిలో అభివృద్ధి పరచడం పురపాలక సంఘాల తక్షణ కర్తవ్యం.

## కుందుర్తికి సన్మానం

శ్రీనివాస సాహితీ సమితి ఐదవ వార్షికోత్సవంలో వచన కవితా పితామహుడు శ్రీ కుందుర్తి ఆంజనేయులుకు సన్మానం జరపడం, 'కుందుర్తి కృతులు' పై వెలువడిన సమీక్షా వ్యాసాలను 'అడుగుజాడలు' అన్న పేరుతో ముద్రించి ఆవిష్కరించడం సాహితీప్రియులకు సంతోషదాయకమైన విషయాలు, ఇవి మార్చి 28 వ తేదీన కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంలో జరిగాయి. అధ్యక్షత వహించిన డాక్టర్ అప్పారావు, వ్యాస సంకలనాన్ని ఆవిష్కరించిన సుప్రసిద్ధకవి శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తి, డాక్టర్ అరిపిరాల విశ్వం డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యం, అడుగుజాడల సంకలన సంపాదకులు శ్రీ పోరంకి దక్షిణామూర్తి ప్రజాకవిగా కుందుర్తి సేవను ప్రశంసించారు. అడుగుజాడలు ప్రచురణౌచిత్యాన్ని మెచ్చుకొన్నారు. ప్రారంభంలో సమితి కార్యదర్శి శ్రీ తుంగతుర్తి విశ్వనాథశాస్త్రి స్వాగతం చెప్పారు. శ్రీ సి. కృష్ణా ఆదిశేషు వందన సమర్పణ చేశారు.

## ఆల్విన్ సంక్షేమ సంస్కృతిసంఘం నాటకాలు

ఆల్విన్ కంపెనీ సంక్షేమ సంస్కృతి సంఘం నిర్వహించిన నాటికల పోటీలు మార్చి 29, 30 తేదీలలో సాయంకాలం రవీంద్ర భారతిలో జరిగాయి. ఈ కార్యక్రమాన్ని శ్రీమతి సుగుణ ప్రతాపరెడ్డి 29 న ప్రారంభించారు. సమాప్త్యుత్సవానికి ఆల్విన్ మెటల్ వర్క్స్ కంపెనీ చెయిర్మన్, మేనేజింగ్ డైరెక్టరు శ్రీ బి. ప్రతాప. రెడ్డి (ఐ. ఏ. ఎస్) అధ్యక్షత వహించారు. గారువమ్మడి బ్రతుకులు, నాన్నాపులి, దారి తప్పిన ఆకలి, కుక్క, మరో శవం పుట్టింది - అనే నాటికలు పోటీలో ప్రదర్శించబడ్డాయి. అప్నీ వోర్, దాంత్ అనే హిందీ నాటిక ప్రదర్శించిన తర్వాత నాటికల పోటీలో గెలుపొందినవారికి బహుమతులు ఇవ్వబడ్డాయి.

## అణుశక్తి కళాసమితి ఉగాది వేడుకలు

అణుశక్తి కళాసమితి ఉగాది వేడుకలు డి. ఎ. ఇ. కాలనీలో బ్రహ్మాండంగా జరిగాయి. ఆరు, బయలు రంగస్థలం గ్యాలరీ కిటకిటలాడింది. జనంతో. స్వాగతం చెప్పిన శ్రీ ఎం. పి. ఎస్. శర్మ (ఫైనాన్షియల్ కంట్రోలర్, అణుశక్తి సంస్థ) అధ్యక్షత వహించిన శ్రీ తిరుమల రామచంద్ర ముఖ్యాతిథి శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి ఉగాది విశిష్టతను చెప్పారు. భాగవతుల రావి కోటిశాస్త్రి పంచాంగ శ్రవణంచేస్తూ అనేక జ్యోతిశ్శాస్త్ర విషయాలు తెలిపారు. గ్రహాల ప్రభావం ప్రజల దేహ మనస్సులపై ఎలా పడుతుందో వివరించారు. శ్రీ సర్వకళామయకళానికేతన్ వారు "వరుడు కావాలి" నాటికను, విజయనగర్ కాలనీ నృత్యాంజలివారు "మురళీ ఆరాధన" అనే నృత్య నాటికను, శ్రీమతి గిడుగు విశాలాక్షి బృందం భరత నాట్యం, మొక్కజొన్నతోటలో, మధురానగరిలో సర్పనృత్యం మొదలైన నృత్యాలను ప్రేక్షకరంజకంగా ప్రదర్శించారు. ప్రారంభంలో కుమారికలు సరస్వతి, స్వర్ణలత 'మా తెలుగు తల్లికి' ప్రార్థన గీతం ఆలపించారు.

## ఉపశ్రుతి:—

"ఇదేమయ్యా, ఇడ్లీ, వడ సన్నగిల్లిపోయాయి ?' అన్నాను, ఒక హోటల్ యజమానితో "ధరలు పడిపోయాయి కదాసార్!" అని అన్నాడు ఆయన మందహాసంతో. ●

# డ్రీమ్‌ఫ్లవర్ తాజాతనము పరిమళం కూడా రోజంతా... మీ ఒళ్లు అంతా.

అప్పుడే స్నానం చేసిన తాజాతనం ఎన్నిగంటలైనాసరే, రోజంతా ఇల్లాగే ఉంటుంది పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్‌తో నిర్మలంగా చల్లగా ఉండడానికి ఒళ్లుఅంతా వేసికోండి. దాని సున్నితమైన పరిమళం ఒళ్లు అంతా పట్టుకొని ఉంటుంది, ఒంటి మీది చెమ్మను పీల్చేస్తుంది, పొడిగా ఉంచి. ఆనందాన్ని కలిగిస్తుంది. మండు వేసంకాలంలో అయినాసరే చెమట కంపు ఉండదు, ఒళ్లు అంటుకోదు. అతి మృదువుగా పట్టులా ఉండటంచేత ముఖానికికూడా వాడవచ్చు. పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్‌— మీకు మీ కుటుంబానికి అవసరమైన టాల్క్‌—



**పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్**

భోగకరమైన టాల్క్ కుటుంబానికి పొదుపుతో



ఋణం యిప్పించాడు. స్వయం వుపాధి కల్పన క్రింద కోళ్ళ పరిశ్రమ పెట్టాం" అంది.

ఇదంతా అన్నయ్య సహాయం వల్లే అయింది. ఒక్కొక్క రోజు అన్నయ్య ఇంటికి రావటానికి లేటైపోయేది మేము ముగ్గురం కబుర్లు చెప్పుకుంటూ కూర్చునేవారం."

"అలానా," ఆశ్చర్యంగా అంది భారతి.

అన్నయ్య ఎన్నిసార్లు భోజనం చేయమన్నా నీవు ఎదురుచూస్తూ వుంటావని తినేవాడు కాదు, ఎప్పుడైనా నేను అయన బలవంతంచేస్తే, ఇష్టం లేనట్లుగా తినేవాడు. 'మరి మీవారిని నాకు ఎప్పుడు చూపిస్తావు' మాట మార్చింది భారతి. "రేపు నీవు మీ వారు మా యింటికి భోజనానికి రండి." అని చెప్పి భారతి యింటికి వెళ్ళిపోయింది.

'శ్రీమతిగారు చిరాకు వదలి దీనంగా చూస్తున్నారు' ఇంట్లోకి వస్తూనే అన్నాడు శరత్

"మిమ్మలని బాధపెట్టినందుకు క్షమిస్తారుకదూ" జాలి గొలిపేవిధంగా అంది భారతి.

నిప్పులు త్రొక్కిన పద్ధతిలో వుండే భారతి అలా అనేసరికి ఆశ్చర్యంలో మునిగిపోయాడు శరత్. "అన్ని అనుమానాలతో మిమ్మలను బాధపెట్టాను" శరత్ షర్టు గుండీలు సరిచేస్తూ అంది భారతి.

"నేను నిర్దోషినని సి.ఐ.డి. వారు ఒప్పుకున్నట్లేగా" దగ్గరకుతీసుకున్నాడు. 'ఈ వారం రోజులు నాతో మాట్లాడకుండా నన్ను దూరంగా వుంచావుకదూ' శరత్

# మల్లెమాల

(14వ పేజీ తరువాయి)

శ్రావ్యంగా ఆమె చెవిలో అన్నాడు.

'మనుష్యులు దూరమైతే మమతలు చేరువు అవుతాయి. వారం రోజులు మీ ఎడబాటు నాకూ ఎంతో బాధనిపించింది' అంటూ భారతి శరత్ గుండెల్లో మొఖం దాచుకుంది. జీవితం సమస్త ప్రకృతిలోను శరత్‌ని నింపుకొని ఆరాధించిన ఒక పవిత్ర ప్రణయజీవి ముగ్ధ మనోహరంగా మనో నేత్రం ముందు సాక్షాత్కరించే ఈ భారతి ఒక అద్భుత మూర్తి శరత్‌కి, అనిపించింది.

వారం రోజులనుంచి నాకు ఎన్ని బాకీయో తెలుసా అంటూ భారతి ఎర్రటి పెదవులపై శరత్ లేలికగా ముద్దు పెట్టుకున్నాడు. ఇంతలో అనిత, అజయ్ వచ్చారు. వదినా నీవు రేపు భోజనానికి రమ్మన్నావు, అన్నయ్య నీకు తెలియకుండా సాయంత్రం టీకి రమ్మన్నాడు. ఈ రోజు టీ, రేపు భోజనం, అని నవ్వింది. శరత్ ఆశ్చర్యంతో 'భారతి, నిన్ను భోజనానికి పిలవటం ఏమిటి?' 'పొద్దుట బజార్లో కనపడింది, అనిత మీరు చేసిన సహాయం గొప్పగా చెప్పింది. మీరు చెప్పితే శ్రీవారి గొప్పతనానికి నేను సంతోషించేదాన్నిగా' అంది భారతి.

'అన్ని వివరాలు చెప్పనిస్తేగదా' శరత్ భారతి బుగ్గలు నిమిరాడు.

"ఊరుకోండి అవతల వాళ్ళు వున్నారు."

"వాళ్ళు నిన్ను ముట్టుకోవద్దన్నారా" శరత్.

# యువతరం

ఈ ఫొటోలోని ప్రసాద్ వి. నూలి ఇంటర్మీడియట్ వరకు భీమవరంలో చదివాడు. ఇప్పుడు మైసూరులో బి. ఇ.



చేస్తున్నాడు. కలం స్నేహం, మంచి నవలలు చదవడం, స్కేటింగ్ చేయడం నా హాబీలు — సినీమాలు చూడటం కన్నా స్నేహితులతో సరదాగా కాలక్షేపం చేయటం మంచిది అన్నాడితను.

ఇతనికి అభిమాన నటులెవరూ లేరు. రోజూ లైబ్రరీకి వెళ్తాడు—బాస్కెట్ బాల్ ఆడుతాడు. కాలేజీ టీమ్‌లోకి ఎన్నుకోబడ్డాడు. మద్యపానంపై యెలాంటి అభిప్రాయం లేదు. అయినా నాకు త్రాగటం ఇష్టంలేదు అన్నాడీ బి. ఇ. విద్యార్థి. ఫాషన్‌గా వుండే కంటె సీదా సాదాగా వుండటమే నా కిష్టం. అమ్మాయిలతో మాట్లాడాలనుంటుందతనికి, కేవలం స్నేహం కోసం సోదరీమణుల లాగా! బి. ఇ. పాసై విదేశాల్లో చదువుకోవాలనే అతని ఆశయం నెరవేరాలని ఆశించాలి.

ఆమెను దగ్గరకు లాగాడు.

అయ్యో అంటూ ప్రక్కకు తప్పుకుంది. 'వదినను ఏడిపించకన్నయ్యా అసలే ఆమె ఒట్టి మనిషి కాదు' అంది అనిత. 'అరే బలే దొంగవు చెప్పావు కాదు' శరత్ నవ్వుముఖం పెట్టాడు.

'ఎందుకులెండి మీ ఆస్పత్రికి రానులెండి పురుడు పోసుకోవటానికి' భారతి వీణ మీటినట్లు నవ్వింది. అందరు గుండెలు పగిలేటట్లు నవ్వుకున్నారు.

అనిత ఆదర్శ వర్ణాంతర వివాహం, భారతికి, ఆమె తరుపు వారికి, బాధ కలిగిస్తుందనే బాధ, శరత్ నుండి తొలగిపోవటంతో అతని హృదయం, తేలికపడింది. భారతి విశాల భావాన్ని అతను అభినందించాడు.






# షాక్ న్యూస్ డైరి

## ఆత్మహత్యా సాధనం !

నాగార్జున ప్రాజక్టుకు చెందిన విజయపురిలో విజయవిహార్ గెస్ట్ హౌస్‌లో వంటలుచేసే ఇంగ్లీషాయన కూతురు సెలస్టీనా అనే ఆమె భర్తతో తగాదాలు చేసుకుని, కాస్త మన శ్శాంతికోసం తండ్రి దగ్గరుంటోందట. కాని ఆమె తండ్రి ఆమెకు మరో 50 ఏళ్లతనితో పెళ్లి తలపెట్టేసరికి జీవితంమీద అసహ్యం పుట్టి ఆమె రిజర్వాయర్‌లో దూకిఆత్మహత్య చేసుకున్నదట. ఆమెకు 19 ఏళ్లట. అదే రిజర్వాయర్‌లో 20 ఏళ్ల నాగలక్ష్మి అనే ఆమె దూకిచనిపోయిందట. ఆమెకు మతిస్థిమితం లేదట. విద్యుచ్ఛక్తి శాఖలో పనిచేస్తున్న నాగేశ్వరరావనే అతని భార్యట. ఆమెను రక్షించబోయిన ముగ్గురిలో 50 ఏళ్ల వెంకన్న అనే అతను కూడా ఆమెతోబాటే చనిపోయాడట.

## పట్టుబడ్డ విదేశీ సరుకు

బొంబాయిలో కస్టమ్స్ శాఖవారు అనుమానంతో చెంబూర్ ప్రాంతంలో రెండు లారీలను తనిఖీచేయగా 23 పెట్టెలు దొరికాయట వాటిలో విదేశీ గడియారాలు, చేతిగడియారాలూ కొల్లలుగా వున్నాయట. వాటి ఖరీదు 50 లక్షలట. ఇంత విలువైన విదేశీ సరుకులు స్వాధీనం చేసుకోడం ఇదే మొట్టమొదటిసారట.

## దొంగతనంలో నూత్నపంథా !

ఉత్తర ప్రదేశ్‌లోని సిలేఖువా అనేచోట వో దొంగాయన కొత్తరకం ఎత్తువెత్తి ఆ పదకం ప్రకారం తన భార్యాపిల్లలను తీసుకువెళ్లి వో మూసేసిన బట్టల దుకాణంముందు తెల్లవారు జామున కూర్చోపెట్టి శక్తికొద్దీ ఏడవమన్నాడట వాళ్లా పనిచేస్తూ ఆదారేపోయేవారినంతా ఆకర్షిస్తూంటే దొంగగారు పెరటిదారిన కొట్లో బట్టలు దొంగతనంచేసి చక్కాపోయాడట. ధర్మపత్ని అనగానేమి !

## 13 ఏళ్ల బాలుని మరణం

తాడేపల్లిగూడావికి సమీపంలోని కొండ్రుప్రోలు అనే వూర్లో 11 ఏళ్ల గేబ్రియల్ అనే కుర్రవాని శవం వూరిచివరి పొలాలలో దొరికిందట. అతడు పాముకాటుకు చనిపోయి ఉండాలనిఅనుమానించారట. శవపరీక్షను స్థానిక మెడికల్ ఆఫీసరు చేశారట. (ఆయన రిపోర్టు వివరాలు రాలేదింకా) కానీ, పోలీసు డిప్యూటీ సూపరింటెండెంట్ బాల కొండయ్యగారు మాత్రం యిది హత్య అయివుంటుందనుమానిస్తున్నారట.

## పిల్లల్నీ, తన్నీ కాల్చుకున్న పడతి

ఫతేగడ్‌కి చెందిన సరాయి మీరన్ అనే వూళ్లో వో ముప్ఫయ్యేళ్లఆమె తన మూడేళ్ల, ఏడేళ్ల కొడుకులను తుపాకితో కాల్చిచంపి, తానూ అదే తుపాకిలో కాల్చుకుని, చనిపోయిందట. తన, తన పిల్లల శవాలను తన భర్త, తానుకూడా తాకరాదని ఆమె వో ఉత్తరంలో రాసిపెట్టి మరీ యీ దారుణం చేసిందట.

## ప్రమాదంలో పోలీస్ ఇన్‌స్పెక్టర్ మృతి

మద్రాసులో ట్రాఫిక్ ఫ్లయ్యింగ్‌స్క్వాడ్‌కు చెందిన రిజర్వ్ సబ్ ఇనస్పెక్టరు 30 ఏళ్ల నెటో అనే ఆయన మొన్న తొమ్మిదో తేదీన రాత్రి పైక్రాఫ్ట్స్ రోడ్డులో మోటారు సైకిలుమీద ప్రయాణం చేస్తుండగా ఆయన్ను ఆర్. టి. సి. బస్సు గుద్దిందట. దాంతోఆయన ఆసుపత్రిలో చనిపోయాడట. మోటారుసైకిలు మీద వెనుక కూర్చున్న ఆయన స్నేహితుడు 30 ఏళ్లబాబు పరిస్థితి ప్రమాదకరంగా వుందట.

## సెకనుకు 2.6 కోట్ల లీటర్లు !

నయాగరా జలపాతంలో క్రిందకు పడేనీరు ఒక సెకనుకు రెండువందలరవై లక్షల లీటర్లట? ఏం!అప్పైన కొంచెం ఎక్కువుండరాదా! నిపుణులు లెక్కలుకట్టి తేల్చారటవిషయం.

## లారీప్రయాణ ప్రమాదం

పెళ్లిజనాన్ని వో అరవైమందినిమోసుకువస్తున్న లారీ ఒకటి బెలగాం ప్రాంతంలో నడక కుదరక తిరగబడిందట. దాంతో పెళ్లికూతురు, మరో అయిదుగురు అక్కడికక్కడే చనిపోయారట. దాదాపు అందరికి గాయాలు తగిలాయట.



# కళకళలాడుతూ తిరిగివచ్చింది రికరి గ్లాసు




గ్లాసులోని రికరి పొడిని
ఒక రికరి సీసాలో
పోసుకోండి.
గ్లాసును యధేచ్ఛగా
వాడుకోండి.

ఇప్పుడు ధర
50 పైసలు
తక్కువకూడ

త్వరపడండి!
స్టాకు
పరిమితం

Nestle
## రికరి
ఇన్‌స్టెంట్

దాదాపు డికాక్షన్ కాఫీ ధరకు
డికాక్షన్ కాఫీ రుచినిస్తుంది

NRCM-29-78 TEL






# కొలువు

(8 వ పేజీ తరువాయి)

ఊరికొసవరకూ వెళ్ళి, ఆఖరికెలాగయితేనేం రహదారి బంగళా చేరుకున్నారు.

"యిదే దొర బంగలా!" భయంగా, సింహాద్రితో అన్నాడు రామన్న. రామన్న భయం చూసి సింహాద్రీ భయపడ్డాడు. అయ్యకేదీ లవకూడదు, అని అమ్మోరికి మొక్కేడు.

బంగాళా చుట్టూ మూడడుగుల ఎత్తు గోడ ఉంది. బంగళా ఆవరణలో ఒక పెద్ద చింతచెట్టు కొమ్మలని నాలుగు దిక్కులా విస్తరింపజేసి 'జుత్తు విరబోసుకున్న ఉన్మాది నిలా ఉంది. బంగళా రెండు గదుల్లది. ముందుకు వరండా ఉంది. మీదనున్న పెంకులు వర్షానికీ, కాలంవల్లా మకిలి పట్టేయి. గోరింటపూలచెట్లు పెంకులమధ్య మొలిచేయి. వరండాలో రెండు పాత కుర్చీలు దేవుడులేని పీఠాలలా బోడిగా ఉన్నాయి.

చింతచెట్టు నీడ రోడ్డుమీద కూడా పడు తోంది. రోడ్డుమీది నీడలో ఒక కుర్ర గుమ్మటంలో కిళ్లీబడ్డీ వెలిసింది. కిళ్లీబడ్డీలోని సీసాలనిండా రంగు రంగుల కలర్‌నీళ్ళు, సూర్యకిరణాలలో మెరుస్తూ, ఇంద్రధనస్సు అక్కడకి దిగొచ్చినట్లుగా కాంతులు విరజిమ్ముతున్నాయి. గ్యాసు తక్కువున్న గోలీ సోడాలు, జలుబు చేసిన వాడిలా తుమ్ముతున్నాయి. కిళ్లీకొట్టులో ఒకడే కూర్చోగలడు. సముద్ర కెరటంలా విరుచుకపడే జుత్తుతో, ఒక మధ్య వయస్కుడు కిళ్లీలు కడుతున్నాడు, సోడాలు కొడుతున్నాడు, కల్లు రొట్టెలు అమ్ముతున్నాడు...ఆ గుమ్మటంలో కూర్చొని.

కిళ్లీకొట్టు దగ్గర ఆగి రామన్న గిరజాల వాడిని అడిగేడు,.."బాబూ! దొరగారొచ్చినారా?"

"ఎవుడ్రా ఆ దొర? యెక్కడికొస్తాడేటి?" విసురుగా అన్నాడు ఆ కిళ్లీ మనిషి.

"అయ్యా! నాకొక సోడా యిప్పించవా?" కోరేడు సింహాద్రి.

రామన్న కొట్టువాడిని మంచి చేసుకొందుకీ ఐదు పైసలు తీసి ఇస్తూ "ఒక సోడా ఇయ్యి బాబూ!" అన్నాడు. కిళ్లీవాడి ముఖంలో ప్రసన్నత కనిపించింది. నీళ్లలో ఉన్న గోలెంలోనించి ఒక గోలీ సోడా తీసి, చూపుడు వ్రేలితో కొట్టేడు. సోడాబుడ్డి ఏనాడూ స్నానం చెయ్యని మనిషిలా చుండు పట్టి వుంది. సింహాద్రి సోడాని అప్యాయంగా తాగేడు. పట్నంలో సోడా తాగుతున్నందుకు వాడి మనస్సు ఉరకలు వేసింది. "ఏ దొరన్నావు?" కిళ్లీవాడు అడిగేడు.

"తాసిల్దారు దొర, బాబూ!"

"అడా! ఇంత పెందలకాడే ఆడెందుకొస్తాడు. పూటుగాలిని, తొంగొని, రెండు గంట్లు ఒయిజాగ్ ఎక్స్‌ప్రెస్‌లో దిగుతాడు! ఏటి సంగతి?" దొరంటే అంత తేలికగా మాట్లాడటం రామన్నని ఆశ్చర్య పరచింది.

సంగతంతా చెప్పేడు, కిళ్లీకొట్టువాడే దొర అయినట్టు. అంతా విని వాడడిగేడు, "దచ్చిన తెచ్చేవా?"

"ఏటన్నావు బాబూ?" అర్థంకాక అడిగేడు రామన్న.

"య్యాం...య్యాం!" చేతితో చిటిక వేస్తూ కళ్ళు ఎగరవేసేడు.

రామన్న కర్థమయింది. దొర అలాటోడైతే తన పని సరి! "నాకాడేటుంది బాబూ! ఏపూట కాపూట గంజినీరు కాని, అంబలికాని దొరకడమే కష్టమౌతోంది ..." దీనంగా అన్నాడు.

సానుభూతి చూపిస్తూ పెదవులు వప్పరించేడు కిళ్లీలవాడు. "ఎల్లి ఆసింత సెట్టుకింద కూకో. పన్నెండుకి మా సెద్దమ్మ ఎట్టిన రాజుల మిలటరీ ఓటలుకెళ్ళి బోం చెయ్యండి. రేటు రెండ్రూపాయలు: బస్ స్టేండ్ కాడుంది వోటలు..." అని సిఫార్సు చేసేడు.

చింతచెట్టు నీడని ఇద్దరూ కూర్చున్నారు. నీడ చల్లగావున్నా ఈగలభారి జోరుగా ఉంది. రాత్రి వర్షం పడటంవల్ల నేలంతా సెమ్మగా వుంది. కిళ్లీకొట్టు క్రిందనిపారే మురికి కాలువ కంపు గాలిలో కలిసి ముక్కుకి తగులుతోంది. బంగళా చౌకీదారు యమకింకరుడిలా ముఖం పెట్టి, కంపులో పోటీగా బాధ పెట్టడానికి వచ్చేడు. "ఈడ కూచున్నావ్ ఏవరు నువ్వు! ఎళ్లెల్లు బయటికి! బంగలా నీ తాత కట్టించనేదు!"

"తాసిల్దారు దొర అజరవమన్నాడు— ఎప్పుడొస్తాడు దొర?" చేతులు కట్టుక అడిగేడు రామన్న.

చౌకీదారు ధోరణి మారింది. "రాతల! మద్దినాలొస్తాడేమో?...నీకాడసొగాకుందా?"

సంఘం చేసిన మనిషికి - మనిషి చేసిన చట్టానికి సంఘర్షణే

గంగాధర్

విజయలక్ష్మీ పిక్చర్స్ సమర్పించు

రాజ్యం ప్రొడక్షన్స్

# మగాడు

ఈస్ట్‌మన్ కలర్

నిర్మాతలు:

**లక్ష్మీరాజ్యం**

**శ్రీధరరావు**

**శ్రీకాంత్ నహతా**

దర్శకత్వం: **యస్.డి.లాల్**







శ్రీకాంత్ [illegible]

అని చెయ్యి జాచేడు. తెచ్చుకున్న ఒకే ఒక్క చుట్టపీక తీసి వాడి కిచ్చేడు రామన్న.

సింహాద్రికి కదలకుండా కూర్చోడం నచ్చ లేదు. ఇదివరకు వాడు సినిమా చూపుకి వచ్చి నపుడు చీపురుపల్లి, రాత్రి ముసుగు వేసుకొని వెన్నెల పౌడరు అద్దుకొని, విద్యుద్దీపాలనగలు ధరించి, అందంగా ఉన్నదన్న భ్రమ కలిగించింది. ఇప్పుడు చీకటి ముసుగు, వెన్నెల మెరుగు, దీపాల అలంకరణ లేక, అదేపట్నం, మట్ట మధ్యాహ్నం నగ్నంగా, వెలుగుగా ఉంది. కాలవ కంపు, దోమల దాడి, ఈగల దండ యాత్ర, మనుష్యుల తోపులాట. బస్సుల రొద, ఇరుకుసందుల సంకుచితత్వం, వ్యక్తుల స్వార్ధం, దుఃఖం, బాధ, చీదర, క్రూరత్వం ఇవన్నీ పగలు, సూర్యకాంతిలో, చూడాలను కుంటే కనిపిస్తాయి. సింహాద్రి చిన్న మన సుకి ఇవన్నీ చూసే నేర్పులేదు. వాడికి పల్లె టూరుతో పోలుస్తే ఈవూరు బాగుంది. రోడ్లు బాగున్నాయి. ఇళ్లూ చాలా బాగు న్నాయి.. బస్సులు అందంగా వున్నాయి. మంచి బట్టలు తొడుకున్న బాబులూ, అమ్మలూ విడినపువ్వులలాగున్నారు. స్కూలుకి వెళ్లే పిల్లలు విడబోయే మల్లెమొగ్గలలాగు న్నారు. కాని వాడి కళ్లకు కనిపించలేదు. వారి మనసులలో గూడుకట్టుకున్న చీకటి, అతృత, భయం, తెల్లబట్టల దొరల బుర్రలలో నల్లటి ఊహలున్నాయనీ,అందమైన చీరలుకట్టుకున్న అమ్మల మనసులలో కోరికల సర్పాలు విషం కక్కుతున్నాయనీ, మొగ్గల్లా అగపడే ఆ స్కూలు పిల్లల కడుపులలో ఆకలి ఉందనీ వారిలో చాలామందిని అది బాధిస్తోందనీ వాడికి తెలీదు.

కాలాన్ని ఎలా వేగంగా ఖర్చు చెయ్యడమో తెలియక దిగులుగా కూర్చున్నారు ఇద్దరూ: మూడుగంటలు గడిచేయి. దొర ఎంతకీ రాడు. ఇక్కడెవరికీ తమ సంగతి పట్టే పట్టదు! కూమూరురో అయితే ఏ కొత్త వాడొచ్చినా కనిపించిన ప్రతివాడూ అడుగు తాము "ఏవూరు మంది ఎవుడింటికొచ్చినావు ఏటి జేస్తుండావు..." అని.

ఏమీ తోచక బంగళా అంతా చుట్టబెట్టేడు సింహాద్రి. పెరట్లో నుయ్యి ఉంది. ఊళ్లోని స్త్రీ జనం, పనిమనుష్యులు వచ్చి నీళ్లు తోడుకవెళ్తున్నారు. చపటా నిండా బిందెలు. బిందెకొక ఆడది. ప్రతి ఆడదాని నోరూ ఒక లౌడ్‌స్పీకరు. తాటిఆకు చేదలతో నీళ్లు తోడుతూ, మగాడు వినడాని క్కూడా సిగ్గుపడే సంగతులన్నీ మామ్మూలు సంగతులలా చర్చించుకుంటున్నారు. కోపం లేనప్పుడు తన గూడెంలోని మనుష్యులుకూడా ఇలా ఎపుడూ మాట్లాడుకోరు. అయ్య ఒక్క నాడూ తప్పమాట మాట్లాడనేదు. అమ్మ యెప్పుడూ యెవురితోనూ తప్పమాట సెప్ప నేదు. యిది టవునుగదా ... యిక్కడట్టానే ఉంటది ! అనుకున్నాడు సింహాద్రి.

బంగళా గదిలోకి తొంగి చూసేడు. మంచం, పరుపూ, టేబిలూ, కుర్చీ ఉన్నాయి. గదులెంతో బాగున్నాయి. కిటికీదగ్గర గూడు కట్టిన కందిరీగ పొడవడాని కొచ్చింది. కంది రీగకికూడా కులం తెలుసు కామోసు...రోడ్డు మీది పెంటకుప్పదగ్గర ఇద్దరు ముష్టి కుర్రాళ్లు కాళీ డబ్బాలకోసం కొట్లాడు కుంటున్నారు భయంకరంగా...పింపిరి పట్టిన డబ్బాని చెరొకపక్క లాగుతున్నారు. సింహాద్రికి భయంవేసింది.

"అయ్యా! ఆకలేస్తోందిరా!" ఆకలికి ఓర్చుకోలేక అన్నాడు సింహాద్రి.

సూర్యుడు నడినెత్తిమీది కొచ్చేడు. ఎండ చుర్రుమంటోంది. ఉదయమే దొర దర్శన మయిపోతుందనీ, వెంటనే ఇంటికి పోవచ్చనీ, ఏభై పైసలు మాత్రం తెచ్చేడు రామన్న. ఇప్పుడు రోజల్లా ఇక్కడుండాలి. దొర ఎప్పుడొస్తాడో తెలీదు. దొరలకి, దొరలుకాని వాళ్ల బాధలేం తెలుస్తాయి? ఇంక ఈ సింహాద్రికి ఏదో ఒకటి తినిపించాలి ...

కిళ్లీకొట్టు దగ్గరకి ఇద్దరూ వెళ్లేరు. ఎలకపిల్లల్లా కనిపిస్తున్న పళ్లతో మాగిన నల్లటి అరటిపళ్ల గెల వ్రేలాడుతోంది కిళ్లీ కొట్టు మొగలో. ఈగలు వాటిమీద భరత నాట్యం చేస్తున్నాయి.

"అరటిపండు కరీదెంత ?" రామన్న అడకువగా అడిగేడు.

"తాసిల్దారింకా రానేదా ? ఆడువొాయి జాగ్‌లో కాని రాడు ... పండు పదిపైసలు. యిది తింటె నీకేటి కడుపు నిండుద్ది ? ఓటలుకెల్లరాదా ?"

"బేగి ఎళిపోతామనుకొని పైసలు తక్కువ తెచ్చినాను..."సిగ్గుపడుతూ రామన్నచెప్పేడు.

"నీకాడ ఎన్నిపైసలున్నయి?" కిళ్లీకట్టి,



'పెళ్లిరోజు' చిత్రం ద్వారా
ఆంధ్రుల ఆదరాభిమానాలకి
పాత్రులైన
ఎం.ఎస్.శ్రీరామ్ సమర్పించు
సూర్య చిత్ర కంబైన్స్ వారి
మంచిరోజు
సంగీతం-దర్శకత్వం
ఎం.ఎస్.శ్రీరామ్
నిర్మాతలు
ఎం.సత్యవతీ దేవి
బి.రామకోటేశ్వరరావు
సహనిర్మాతలు
కె.వెంకటరత్నం
కె.అరుణ
ఆంధ్ర: సువర్ణా ఫిలింస్

# కొలువు

కళ్ళు తురోకిస్తూ అడిగేడు కిళ్లీలవాడు.

"నలభై అయిదు పైసలున్నాయి. దారి కరుసుకి పదిహేను పైసలు కావాల!"

పదిహేను పైసలకి దారిలో ఈ పల్లెటూరి వాడికి ఎవరేముమ్మతారో, ఏ ఆస్తులు ధారపోస్తారో అర్థంకాక ఆశ్చర్యంగాచూసేడు కిళ్లీల మనిషి. ఉతికినా మాసినట్టే కనిపించే చిరిగిన ముతక బట్టలతో, ముఖంలో నిజాయితీతో, కళ్లలో దైన్యంతో నిల్చున్న రామన్ననీ, అతడి పక్కని నిల్చున్న ఎనిమిదేళ్ల సింహాద్రినీ చూసేసరికి వాడికి తన తండ్రీ, చిన్ననాటి తనూ గుర్తుకొచ్చి మనస్సు కరిగింది. సీసా రేకు డబ్బాలోంచి ఒక పెద్ద డబల్ రొట్టె తీసి రామన్న కియ్యబోతూ అన్నాడు. "యిదిద్దరూ తిని, మూతికాడ నీరు తాగి కసంత నెట్టుకొంచ తొంగోండి! ఆ దొర ... కొడుకెపుడొస్తాడో? ఇయ్యాళా రేపూ అందరూ దొరలే. ఎపుడూ మన సంగతడిగి నోడు నేడు!" తనని కూడా కలుపుకొని వేదాంతం మాట్లాడేడు.

రొట్టెవేపు ఆనందంగా సింహాద్రి చూసేడు కాని రామన్న ఎదురుగా చూసి, "ఎన్నిపైసలు బాబూ?" అని అడిగేడు. "ఎంతయితేనేట్లే ... దొబ్బెడూ సుబ్బా తినండి!" అన్నాడు కిళ్లీలవాడు.

"ఊరికనే నాకొద్దుబాబూ! సుబ్బ మాత్రం కొననేదా?" రామన్న అలా అనసరికి కిళ్లీలవాడు నమ్మలేకపోయేడు చెప్పలేని. ఉల్ఫాగా ఒక వస్తువుని తీసుకోమంటే ఉల్ఫాగా నాకొద్దు, ఖరీదిస్తే కొనుక్కుంటాను అన్న వ్యక్తులు కూడా లోకంలో ఉన్నారా, అనిపించింది.

"ముప్పయి పయిసలియ్యి!" దారి ఖర్చుకి పదిహేను వదిలిపెట్టేడు. రొట్టె ఖరీదు ఎనభై పైసలు. అమ్మకం ఖరీదు రూపాయి. లాభం లేకపోగా. నష్టం ఏభై పైసలు. బొడ్డు దగ్గర నించి డబ్బులుతీసి, ఇరు ఐదుపైసలు లెఖ్ఖచూసి రామన్న ఇచ్చేడు. "నీకు నష్టంలేదుకదయ్యా?" అని అడిగేడు. రామన్నకి రొట్టె ఖరీదు ఏనాడూ తెలియదు. ధాన్యం పండించినా అంబలి తప్ప మరేమీ తాగి ఎరుగడు. ముగతకివ్వవలసిన భాగంపోగా, మిగిలిన ధాన్యం అమ్మితే అంబలి తాగడానికి డబ్బులొస్తాయి ఏడాదికి. ప్రపంచంలోని పాలు, పళ్ళూ, రొట్టెలూ దొరల కోసమే కాని తన కోసం కాదని వాడు నమ్మేడు. అవి అమ్మకానికే, తను వాడడానికి కాదు. అవి పెల్లడం వల్లనే తనలాటి వాళ్ళు బతుకుతున్నారు. దొరలు తిననివీ, తను తినేవీ, ఆ డబ్బుతో కొనుక్కోగలడు. అదే లోకధర్మం. దీనికి వ్యతిరేక భావాలు రామన్నకి ఎప్పుడూ రాలేదు, కాని ఈ అంబలి కూడా తనకి దొరకని స్థితి వచ్చేటట్టుంది. ఈ ఆపద గడపకపోతే తన బతుకూ, తన సంసారం బతుకు గాలిపాలే. (ఇంకావుంది)



Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna